అనంతలక్ష్మి కంబైన్స్

# ఈ కాలపు పిల్లలు

నిర్మాత

డి. భాస్కరరావు

దర్శకత్వం

లక్ష్మీదీపక్



మీ అభిమాన 'నవల'కు అపురూప చిత్రకల్పన!




సురేష్ మూవీస్

# సెక్రటరీ

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: డి. రామానాయుడు

దర్శకత్వం: కె. ఎస్. ప్రకాశరావు

ఆంధ్ర: నవయుగ  సీడెడ్: చక్రవర్తి పిక్చర్స్  నైజాం: విజయా సురేష్ పిక్చర్స్.

NVKR

# ఉత్తరాలు

## కథలు

19-3-1976 పత్రికలో ప్రచురితమైన కథ 'తప్పులెన్నువారు' మా ఇంటిల్లిపాదినీ ఆకర్షించింది. 'ఇద్దరం సమానమే' కథ చదువుతుంటే ముప్పాళ్ల రంగనాయకమ్మగారి 'స్వీట్‌హోం' గుర్తొచ్చిందంటే నమ్మండి. కేవలం వంటని మాత్రమే కథా వస్తువుగా తీసుకుని చీటికి మాటికి ఇద్దరము సమానమే, మగబుద్ధి ఇంతే' లాంటి పదములు ఉపయోగించటం బాగాలేదు.

కృష్ణవేణమ్మ (హైదరాబాద్)

## సినిమా

మొన్న పత్రిక వీక్లీలో ప్రసిద్ధ దర్శకునితో శ్రీనివాస్‌గారి పేటీ చదివాను. ఆయన ఏదో ఫిల్ములో ఎన్నో ట్రాకుల్లో హీరోయిన్ల, ఎడ్ల మువ్వలశబ్దాన్ని జనం తాలూకు ఆనందోత్సవాల్ని రికార్డు చేసేఅవన్నీ ఒక ట్రాక్ మీద అతికారు (సూపర్ యింపోజు కావాలు అంటారు) అంటూరాసి అందువల్ల ఆ ఎఫెక్టు వచ్చిందని రాసారు. దాని ముందు షోలే విషయం ప్రస్తావన వచ్చింది షోలేలో ఆరు ప్రత్యేక మైన ట్రాకులు, ప్రదర్శించేటప్పుడు ఆరు మాగ్నెటిక్‌హెడ్స్' ఆరు ఆంప్లిఫైర్లు, ఆ ఆరు ఆంప్లిఫైర్లకు విడివిడిగా కావల్సినన్ని స్పీకర్లూవుంటాయి అందువల్ల విడివిడిగా చేసిన రికార్డింగ్‌లన్నీ విడివిడిగానే అతిసహజానికి చాలాదగ్గరగా విన్పిస్తాయి పోగా పైన తెలుగు సినిమా (ఉదహరించినపేటీలో) సింగిల్‌ట్రాక్, ప్రదర్శింపబడేటప్పుడు ఒకేఆంప్లిఫైరూ పనిచేస్తుంది. అందువల్ల ఎన్ని ట్రాకుల మీద రికార్డుచేసి ఒకే ట్రాకు మీద యింపోజు చేసినా ఫలితం మామూలే ఒకే స్పీకరు మీద ఒకే డైరెక్షన్‌లో విన్పిస్తాయి. అన్ని ట్రాకుల సౌండూ నూ. ఈ పద్ధతి మామూలుగా రీరికార్డింగు (బాగ్రౌండ్ మ్యూజిక్)తో సంభాషణలు కలపడానికి ఉపయోగిస్తూనే ఉన్నారు ప్రపంచం అంతానూ. యిందువల్ల ఎంత ఎఫెక్టు వుందో పైన చెప్పిన కేకలు, మువ్వలు చప్పుళ్లూ, జనంగోల ఒకేట్రాక్ మీద రావడంవల్ల ఎఫెక్ట్ సింగిల్ ట్రాక్ ఎఫెక్టే. (థియరీ 99.9 శాతం ప్రాక్టికల్‌గా కూడానూ) అయినా వారు 'పేటీ'లో శ్రీనివాసుగారు రాసినది నిజమే అయ్యుంటుంది. ఆ సినిమా నేను చూడలేదు. అంత ఎఫెక్టు (స్టీరియో ఎఫెక్టులాగా ఉంటుందను కుంటాను)వారు ప్రత్యేకంగారాసినందువల్లవ్యాసంలో ఆ సినిమా వినాలని (సారీ చూడాలనీ) ఆ రోజునుంచి చదివిన రోజు నుంచీ( ఉబలాట పడుతున్నాను) అలాంటి ఎఫెక్టు గనక వస్తుంటే ఈ ఆరు చానల్ల స్టీరియో యుగానికి ప్రపంచ సినిమా ప్రపంచం గుడ్‌బై చెప్పేయ్యొచ్చును. ఇదొక నిజమైన ఎఛీవ్‌మెంటే సింగిల్ ట్రాక్‌లో యింత ఎఫెక్టురావటం

శ్రీమతి సుప్రియ (మద్రాసు)

## చప ట్లు ?

16.4.76వ తేది పత్రిక ముఖచిత్రం ఏమి బాగాలేదు. "సిపాలు" కథ ఏమి బాగాలేదు. 'హార్ట్ స్పెషలిస్ట్" కద పత్రికకు "హార్ట్" యువతరం అనవసరం. "సామాన్యుని సణుగుడు 'ల ప్రేక్షకుల బాధలు బాగా తెలియజేశారు. ఇదే పత్రికలో "ప్రతాప్‌కుమార్"గారు "మంచి సినిమాలు రావాలి" అని తప్పంతా ప్రేక్షకులమీదే వదిలారు. కాని ప్రేక్షకులొక్కరే దానికి బాధ్యులు కారు. ఎందుకంటే "రెండు చేతులు కలిస్తేనే గదా చప్పట్లు వచ్చేవి" కనుక మంచి సినిమాలు రావాలంటే ప్రేక్షక నిర్మాతలిద్దరు ఒకరికొకరు కృషి చేయాలిగాని, ప్రేక్షకులదే తప్పు అనడం బాగాలేదు. నవ్వించే జోకులు వేయ ప్రార్థన.

జి మెర్స్యమధుకర్, (రాజమండ్రి)

## సామాన్యుని సణుగుడు

సినిమా థియేటర్లలో ప్రేక్షకులు పడుతున్న అవస్థలు థియేటరు వారి ప్రేక్షకుల యెడల చూపుతున్న నిర్లక్ష్యాన్ని "సామాన్యునిసణుగుడు లో చాలా బాగా విమర్శించిన వీరాజీగార్కి అభినందనలు తెల్పుతున్నాను. ఈ వారం 16-4-76 కథల్లో "హార్ట్ స్పెషలిస్ట్ మా హార్ట్‌ను దోచుకున్నది

టి. లక్ష్మీనాగరాజ (జమ్మలమడుగు)

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడ
[1938–1972]
శుక్రవారం 7–5–'76
నలనామ సం వైశాఖ శుద్ధ అష్టమి
*సంపుటము 69 సంచిక 35*
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సరచందా – రు 33–80
ఆరుమాసాల చందా – రు 16–90
విడి ప్రతి వెల 60 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ–520003.

## విషయానుక్రమణిక



లోకం పోకడ




గవర్నమెంటు ఉద్యోగం వచ్చిందా! ఐతే పెళ్ళి చేసుకొని జాయినవ్వుదువు గాని - ఆగు!


కట్నం ఇవ్వాలుల్లేదు సరికదా - పెళ్ళి ఖర్చులూ మనమే భరించాల్ట! వీళ్ళు పుచ్చుకున్న కట్నం డబ్బుల్తో అబ్బాయి పెళ్ళి జరిపిద్దాం!! ఏమంటారు?!


కట్నం యిచ్చే స్తోమత వుండీ - ఇవ్వకూడదని ప్రతిజ్ఞ పడితే - రేపు మన పిల్లల స్తోమత ఎలా పెరుగుద్ది లలితా?!


ఎక్కువ కట్నం ఇచ్చేవాడు వస్తాడని నాకు పెళ్ళి చేయకుండా వుంచావు - ఇప్పుడు చూడు!
పత్రిక
వరకట్న నిరోధానికి గట్టి చర్యలు!


అల్లుడ్ని బ్లాకులో కొన్నారట్ట!


ఇచ్చుకోవడాలూ పుచ్చుకోవడాలూ లేదని మొండి పట్టు పడితే ఎలా బావగారూ! కనీసం అమ్మాయినీ అబ్బాయినీ ఐనా యిచ్చి పుచ్చుకోపోతే ఎలా?!

# "మా చిన్న పిల్ల చలాకీగా, ఆరోగ్యంగా, చురుగ్గా పెరగాలని నాకోరిక. అందుకే నేను రోజూ ఆమెకు బోర్న్‌విటా ఇస్తాను."



## "ఇప్పుడు ఆమెకు తగ్గట్టుగా ఉండేందుకు నాకూ బోర్న్‌విటా అవుసరం"

" మా మొత్తం కుటుంబం రోజూ రెండు పూటలా బోర్న్‌విటా త్రాగుతుంది నా భర్త అదే కావాలంటారు ఎందువలనంటే, దానిలో మాల్టు, పాలు, గ్లూకోజ్ మరియు పంచదారతోపాటు బోర్న్‌విటా సమృద్ధమైన కోకో కలిగియున్నది ఆయన అంటారు అత్యంత శక్తిభరితమై దొరుకుతున్నట్టి ఆహారాలలో కోకో ఒకటి అని, మరియు బోర్న్‌విటా ఏ ఇతర మాల్టుకలిగిన ఆహార పానీయంకన్నా అధికంగా కోకో కలిగియున్నది బోర్న్‌విటాలోని కోకో దాన్ని మరింత రుచికరం చేస్తుంది మా చిన్న పిల్లకి అదంటె ఎంతో ఇష్టం—నాకు తెలుసు అది ఆమె యొక్క కండరాలు, ఎముకలు మరియు మెదడు పెరుగుదలకు అవసరమై, అమూల్యమైన పోషకత్వమంతా ఆమెకు చేకూరుస్తుందని ఇంతేకాక బోర్న్‌విటా ఏ ఇతర ఆహార పానీయములకన్నా ఎంతో పొదుపైనది కూడా. నేను కప్పుకు రెండు చెంచాలు వేస్తాను (మిగతా ఆహార పానీయాలతోలాగా) కాని నా బోర్న్‌విటా డబ్బా చాలా ఎక్కువ రోజులు వస్తుంది వాడి చూడండి మీకే తెలుస్తుంది "




## క్యాడ్‌బరీస్
# బోర్న్‌విటా

**శక్తి ఉత్సాహం మరియు రుచికోసం ఆదర్శమైన ఆహార పానీయం.**

ప్రతి డబ్బాకు అధికమైన కప్పులు,
ప్రతి కప్పులో అధికమైన రుచి !

OBM/5800 TL

పాపనెత్తుకుని పోర్టర్ వెనకాలే ఓవర్ బ్రిడ్జి ఎక్కిన కళ్యాణి వెనక్కి తిరిగిచూసి "అదేమిటే అలావెళతావ్, రావే ఇటు" అంది.

అక్క పిలుపు విని ప్రస్తుతంలోకి వచ్చిన రాధిక అక్క వెనకాలే వెళ్లింది. స్టేషన్ నుంచి ఇంటికిరాగానే అడిగింది కళ్యాణి

"ఏమే రాధా, గోపాలం రాలేదేం ? నిన్ను దిగబెట్టేసినట్టూ ఉంటుంది ఇక్కడ రెండు రోజులున్నట్టూ ఉంటుంది. కూడా రమ్మనక పోయావా ?"

"ఏమిటో అక్కా, ఆయన సంగతి నాకేం నచ్చడంలేదు"

ఏడుపుమొహం పెట్టింది రాధిక

చెల్లెలి ముఖంలో చీకటి చూసి ఎరుగని కళ్యాణి ఎందుకలా అడిగానా అని బాధ పడింది ఇంతలో కరుణ రావడమూ - పాపని ఎత్తుకోవడమూ ఏవో కబుర్లూ అయి పోయాయ్ మర్నాడు కరుణ ఆస్పత్రికివెళ్లి పోయాక రాధిక మనసులోని బాధ బయట పెడితేగాని మనసు తేలికపడదని తెలుసుకుని అడిగింది "ఏం రాధా ఏం జరిగింది ?"

"ఏం చెప్పనక్కా ! ఈమధ్య నీ మరిది గారి ప్రవర్తన ఏం బాగాలేదు వాళ్ల ఆఫీసులో గ్రేస్ అని ఓ టైపిస్ట్ అమ్మాయి ఉంది కులాసాగా కబుర్లు చెప్పగలదు ఆమెకూ, ఈయనకూ మధ్య ఏవో ప్రేమాయణం జరుగుతోంది

"పండక్కి మా ఆడపడుచు రేఖా ఆమె భర్త మురళీ వచ్చారు

వారిద్దరికీ, మర్యాదలూ, ముద్దు ముచ్చటలూ చూడ్డానికికూడా ఆయనకు తీరిక దొరకలేదు ముక్కనుమ మర్నాడు సాయంకాలం వంటగదిలో ఏవో పనులు చేసుకుంటున్నాను అత్తయ్యగారు పురాణానికి వెళ్లారు పండగకాగానే మురళీ వెళ్లిపోయారు

రేఖా నాదగ్గరకు వచ్చింది మెల్లగా.

"వదినా నీ ఓర్పు చాలా మెచ్చుకోదగింది నీలాంటి భార్య దొరకడం అన్నయ్య అదృష్టం"

నాతో చనువుగా ఉండే రేఖ ఏమిటో చెప్మా కొత్తగా మాటాడుతోంది అనుకున్నాను

"ఏం, అలా అంటున్నావ్ ?"

'ఏంలేదు వదినా, అన్నయ్య ఒక గొప్ప వ్యక్తికి అన్యాయం చేస్తున్నాడు'

రేఖ ముఖం చాలా గంభీరంగా అయిపోయింది కంట్లో దుఃఖం నీడలు గొంతు గద్గదికమై పోతోంది

నాకు చెమటలు పట్టాయి

'ఏమిటి నువ్వంటున్నది ?' — కొంచెం విసుగ్గానే అన్నాను

'నువ్వేం అనుకోకు వదినా నువ్ నాకు అక్క కంటె ఎక్కువైనదానివి నాఆనందానికీ సుఖసంతోషాలకీ ఎంతో కృషి దోహదం చేసిన దానివి అన్నయ్య నిన్ను అన్యాయం చేస్తున్నాడు నీలో ఏదో వింత వేదన మెదులుతోందని నేను వచ్చిన దగ్గర నుంచి అను



కుంటూనే వున్నాను.''

'ఆదేంలేదు రేఖా, నా అదృష్టం కొద్దీ దొరికిన భర్త. నన్ను అన్యాయం చెయ్యడమేవిటీ?'

'మొన్న సంక్రాంతి నాడు సుమారు తొమ్మిదిన్నరకు అన్నయ్య ఎవరో అమ్మాయితో అప్సరా హోటల్ దగ్గర ...'

ఇంకా చెప్పబోయింది

''చాలు రేఖా ఎవరిని చూసి ఎవరనుకున్నావో, మీ అన్నయ్య సంగతి నాకు తెలియదా?'' అన్నాను దుఃఖాన్ని– దిగమింగుకుంటూ.

రేఖ ఊరికి వెళ్ళిపోయిన తరవాత కారు ఒకోసారి డ్రైవర్ తెచ్చి షెడ్‌లో పెట్టేస్తూ ఉండేవాడు 'ఏం అయ్యగారు రారా' అంటే 'క్యాంప్ మీద వెళ్ళారమ్మా అనేవాడు. ఆయన మాత్రం ఏ తెల్లవారు ఝామునో వచ్చేవారు ఆటోమీద.

''రేఖ ముఖంలో కనపడ్డ దిగులు డ్రైవర్ ముఖం ముందే తొంగి చూస్తున్నట్టు అనిపించేది ''

''వచ్చేస్తున్నప్పుడు గోపాలం ఏమీ అనలేదా?''—అంతా విన్నాక కళ్యాణి అడిగింది.

''టిక్కెట్టు ఆయనే రిజర్వ్ చేయించారు...నాకు నిజం తెలిసిపోయిందని అయన ఊహించినట్టు లేదు. ఇంతకీ ఇప్పుడు నేనేం చెయ్యనక్కా! ఇంటికి వెళ్ళి ఏం జరగనట్టు, బాధపడకుండా ఉంటున్నట్టు నటించడం ఎలా? నా గతేమిటక్కా!''—బావురు మంది రాధిక

''చదువుకున్న దానివి కదా ఉద్రేకపడడానికిది సమయం కాదు ఊరుకో ఏదో ఆలోచిద్దాం ''

''ఇంకేం ఆలోచన? నేనేదైనా ఉద్యోగం చూసుకుంటా!''

''అదేమిటే? బంగారం లాంటి సంసారం వదులుకుని ఉద్యోగం అంటావ్! నువ్వు ఇంతకీ అపోహ పడుతున్నావేమో! నిదానంగా ఆలోచించి ఏదైనా చేద్దాం.''

రాధికకి తను ఓడిపోతున్నానేమో నన్న భయం ఎక్కువైంది. భర్తను పోగొట్టుకున్నానని ఓ పక్క బాధ. ఉద్యోగం దొరకడం లేదని ఒకవంక అవమానం. ఆ అమ్మాయి మీద అక్కసు, అసూయ. మరో నాలుగు రోజులాగి అక్కతో గోపాలం ప్రస్తావన తెచ్చింది.

''మగవాడి మనసు అర్థం చేసుకోలేం అక్కా''

''పిచ్చిదానా, ఆడదాని మనసు మాత్రం అర్థం చేసుకోగలవా? ఓ మనిషి ఇంకో మనిషిని అర్థం చేసుకోడానికి ఎంత సంస్కారం కావాలి? నిజంగా ఒకరినొకరు అర్థం చేసుకున్న దంపతులు అదృష్టవంతులు.''— నిట్టూర్చింది కళ్యాణి.

''నీకేం అక్కా! బావకు నువ్వంటే ప్రాణం.''

''అయినా నేనెప్పుడూ కష్టపడలేదని ఎంత సులువుగా అనుకుంటున్నావ్. రెండేళ్ళ క్రిందట జరిగిన సంఘటన తలచుకుంటే ఇప్పటికీ నాకు విపరీతమైన లజ్జ కలుగుతుంది ''

''ఏం జరిగిందక్కా?''

''మీబావ ప్రాక్టీసు నీకు తెలుసు కదా! సంఘసేవంటూ వ్యాధిగ్రస్తులకు చికిత్స చేస్తూ ఇల్లూ వాకిలీ పట్టించుకునేవారు కారు .కల్పన అని ఓ స్కూల్ టీచర్ ఉంది రెండు మూడుసార్లు మీ బావగారి దగ్గరకు వచ్చింది వాళ్ళమ్మగారిని తీసుకుని. వృత్తి ధర్మంలో వాళ్ళ ఇంటికి ఈయనా వెళ్ళడం కద్దు. ఓ రోజు రాత్రి ఆయన కోపంగా ఉండడం గుర్తించాను...చిన్న చిన్న విషయాలకు ఎప్పుడూ చిటపట లాడని వ్యక్తి ముఖంలో గాంభీర్యం వింతనిపించింది. ఓ వారం రోజులనాడు ఓ పన్నెండేళ్ళమ్మాయి మేం సాయంకాలం లానులో కూర్చుని ఉండగా వచ్చింది. అప్పటివరకూ అక్కడే కూర్చుని అప్పుడే మీ బావగారు లోపలకు వెళ్ళారు ఎవరో వచ్చారని. ఆ అమ్మాయిని ఆస్పత్రిలోకి పంపాను. కొంచెంసేపు పోయాక ఆయన ఓ ఉత్తరం చింపుకుంటూ వచ్చారు కోపంగా. 'పద ఇంట్లోకి పోదాం' అన్నారు. ఆ రోజు రాత్రి భోజనం చేస్తుంటే ఎవరో ఫోన్ చేశారు. వెంటనే కారు తీసుకుని వెళ్ళిపోయారు ఆయన ... మళ్ళీ ఆదివారంనాడు మరో ఉత్తరం. ఎవరు పంపారని వచ్చిన అమ్మాయిని అడిగాను.

'కల్పనమ్మగారమ్మా. నాంపల్లిలో స్కూల్ టీచర్'' అంది ఆ అమ్మాయి ఉత్తరం నా కంట పడింది. చదవకుండా ఉండలేక పోయాను.

డియర్ డాక్టర్,

నేను క్రిందటి ఆదివారం రాసిన ఉత్తరం అందికూడా నన్ను చూడడానికి రాలేదు. మీ భార్య ఆ ఉత్తరం చూస్తారనుకోలేదు. ఈ రోజు రాత్రి ఎనిమిదింటికి... వస్తారుకదూ.

మీ

కల్పన.

నాకు ఆకాశం విరిగి మీదపడుతున్నట్టనిపించింది

'చీకటిలో కూర్చున్నారేమిటమ్మా'అంటూ వెంకన్నవచ్చి లైటు వేశాడు. ఆ రాత్రి మీ బావగారు పదిన్నరవరకూ ఇంటికి రాలేదు భోజనం టేబిల్‌మీద పెట్టేసి నేను గదిలోకి వెళ్ళి పడుకున్నాను.

ప్రతీ ఆడదీ భర్తమీద ఉపయోగించే ఆయుధం అలక. తీవ్రంగానే ఉపయోగించాను. మీ బావగారు రావడం వెంకన్న తలుపు తియ్యడం పడుకున్న నా ఒంటిమీద చెయ్యి వేసి చూసి ఆయన వెళ్ళి వడ్డించుకు తినడం అన్నీ వింటూనే ఉన్నాను భోజనంచేసి వచ్చి పడుకున్నారు.

నాకు నిద్రపట్టలేదు. తీరని కసి. నిలదీసి అడిగేయాలనుకున్నాను. ఆయన ప్రవర్తన చాలా అవమానకర మనిపించింది. నా నిట్టూర్పులు విని బావ లైటు వేశారు — బాధగా ఉందా అంటూ.

''నా వంట్లో ఎలా ఉంటే ఏం? మీ కల్పనగారెలా ఉన్నారు?'' అన్నాను పొంగుతున్న కోపం అణచుకోలేక.

''ఓ అదా విషయం!''

''ఏం, అంత తేలికగా తీసేస్తున్నారు ... ఛీ. ఇంత నీచానికి దిగుతుందనుకోలేదు. స్కూలుటీచర్‌కదా, సిగ్గూ, ఎగ్గూ అక్కరలేదూ? ఛీ అంత చదువు చదివింది...''

''నువ్వూ చదువుకున్నదానివే ఇంత ఉద్రేకపడుతున్నావ్ ... ఇన్ని మాటలన్నావ్ నీ మంచేదీ?''

## రాలిన ముత్యాలు

......శ్రీ సోమసుందర్......

ముందుకుచూసే ఆధునికతని
శపించే సనాతనత్వం —
మహర్షులు తపస్సు చేసుకున్న
వనాలలోనూ, వృక్షాగ్రాలలోనూ
చరిస్తోంది...

మీ బావగారి ముఖం బాధతో కుచించుకు పోయింది ఏవో అబద్ధాలాడి తనని తను వెనకేసుకొస్తారనుకున్నాను. ఇలా బాధపడతా రనుకోలేదు... కొంచెం తెలివి తెచ్చుకుని అడిగాను

"కల్పన ఎవరండీ ?"

"ఈ ప్రశ్న ముందే అడిగిఉంటే. కల్పన ఒక వయ్యారి ." ప్రారంభించి చెప్పారు.

ఆయనను వలతో వేసుకోడానికి ఓ పన్నాగం పన్ని ఇంటికి కబురునేసి తనేమో సింగారించుకుని కూచుందట అర్జంట్ కేసని వెళ్లిన మీ బావగారు ఆమెకు బుద్ధిచెప్పి వెంటనే వచ్చేశారు.

తరువాత జరిగినది నీకు తెలుసు. రెండో ఆదివారం ఉత్తరం ఆయన నా ఎదుటే చింపేశారు. తరువాత ఆదివారం ఉత్తరం నేనే చదివాను.

ఇందులో ఆయన తప్పేముంది. నీటుగా కనపడతారు డాక్టర్లు ... సరదాగా మాటాడ తారు. ఇలాటి మగవాళ్లు కనపడితే వయసు మీరుతున్న కన్యలు ఏమో అనుకుంటారు ... తరువాత ఆయనను ఎంత బ్రతిమలాడితే ఏం లాభం...ఓ చిన్న జడివానలా ఈ ఉదంతం సాగిపోయింది. ఇప్పుడు నీ విషయంలో కూడా మనం తొందరపడకుండా జాగ్రత్తగా తర వాత కార్యక్రమం ఆలోచించాలి."

ఇది విన్న రాధిక కోపం కొంచెం తగ్గడం ప్రారంభించింది. తనే అనవసరంగా తొందర పడిందేమో ! భర్తకి తనంటే ఎంత ప్రేమ! ఎంతపని చేశాను! అనుకుంది. ఇంతకీ ఆగ్నేస్ మంచి పిల్లేమో ! 'ఇంకా నయం ఆవేశంలో వెర్రిమొర్రి ఉత్తరాలు రాశాను కాను' అనుకుంది రాధిక

కళ్యాణి కరుణకి నిదానంగా చెల్లెలి విషయం వివరించి చెప్పింది కరుణ జాగ్రత్తగా విని 'రేఖ ఎలాంటిది' అని అడిగాడు.

"రేఖ చాలా మంచిది. వదినగారంటే ప్రేమాగౌరవం రెండూ ఉన్న మనిషి."

"మరి గోపాలం ?"

"నాకు అట్టే తెలియదు. కాని మంచి క్రమశిక్షణతో పెరిగిన బిడ్డ. రాధ చెప్పడం కూడా ఇలాంటి చెడ్డ ఆలోచనలు లేనివాడే నని కాని ఏం చెప్పగలం ?"

'ఏంచెప్పగలమూ ? ఇంకా మనం ఈ

# కల్పన

కేసుని పూర్తిగా స్టడీ చెయ్యలేదని మాత్రం చెప్పగలం."

"అయితే ఇప్పుడు ఏం చెయ్యడం ?"

"కేసుని జాగ్రత్తగా అవగాహన చేసుకోవ డమే."

"పొన్లెద్దురూ, మీరూ మీ కబుర్లూ అవతల దాని బ్రతుకు పాడవుతుంటే!" కరుణ బయటకు వెళ్లిపోయాడు.

—"ఏరా ఇంత అర్జంటుగా వచ్చావ్ ?"

— డాక్టర్ జయరాం పలకరించాడు కరుణని.

"మన క్లాస్‌మేట్ విక్టర్ జ్ఞాపకం ఉన్నాడా ?"

"ఆ! ఇప్పుడు కాకినాడలో ప్రాక్టీసు చేస్తున్నాడుగా ఏం, ఏమయింది?"

"అతని ప్రేమాయణం నీకు తెలుసా?"

"ప్రేమాయణమా, నాకు తెలీదే!"

"అతను ఫైనల్ యియర్‌లో ఉండగా




గ్లోరియా అని ఓ నర్సుతో ప్రేమలో పడ్డాడు..."

"వాడి లవ్ ఎఫైర్, అన్నేళ్ల కిందటిది మాటాడానికి నువ్వొచ్చావంటే నే నమ్మను..'

"పూర్తిగా విను. వాళ్ల రొమాన్స్ వాళ్ల నాన్న పసిగట్టాడు. ఓ వారం రోజుల్లో మరి గ్లోరి విక్టర్‌కు కనపడలేదు."

"ఏం హత్య చేయించాడా వాళ్లనాన్న?"

"ఛ! ఛ! అదేం కాదు. విక్టర్ నాన్న డి. ఎం. వో. మంచి ఫ్రెండ్స్. ఓ ఉత్తరం రాసి గ్లోరియానాను ట్రాన్స్‌ఫర్ చేయించాడు.

"ఫైన్. నీ రాకకీ, ఆ కథకీ ఏం సంబంధం?"

"ఉంది. పద చెబుతా

మిత్రులిద్దరూ కారెక్కి వెళ్లిపోయారు. ఎల్. ఐ. సి. బిల్డింగ్ వైపు

—పదిరోజుల తర్వాత గోపాలం దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది

ఈమాటు ఉత్తరంకోసం చాలా ఆత్రంగా చూస్తోంది రాధిక. కొంచెం మంకుపట్టుతో తాను ఉత్తరం రాయడానికి ఇష్టపడక పోయినా, తనెందుకు ఇంత తహతహలాడు తోంది. కిందనుంచి పోస్టురాగానే బావ తన ఉత్తరం మేడమీదికి పంపాడు ఆతృతగా విప్పి చూసింది. క్లుప్తంగా ఉంది

ప్రియమైన రాధికకు,

ఇది నా నాలుగో ఉత్తరం. నువ్ చేరిన తరువాత రాసిన కార్డుముక్క తప్ప మళ్లీ ఉత్తరం రాలేదు అమ్మ పాపకోసం (బెంగ అన్న మాట కొట్టేసి ఉంది) చాలా ఆతృతగా ఎదురుచూస్తోంది. ఉత్తరం అందిన వెంటనే వచ్చేయ్ వెలిగ్రామిస్తే స్టేషన్‌కివస్తా"

గోపాలం.

మరి ఆగలేకపోయింది రాధిక, తను గోపా లాన్ని అనవసరంగా అపార్థం చేసుకుందేమో!

ఇంతకీ తన జీవితంలోకి మరో స్త్రీ ప్రవే శిస్తేమాత్రం, తనెందుకు భయపడి పారి పోవాలి? అగ్నిసాక్షిగా, నలుగురెదుటా పప్పుటి పందిట్లో పెళ్లి చేసుకున్న తనకేం భయం? అవసరమైతే ఆ అమ్మాయితో పోట్లాడాలికాని ఇలా పారిపోయిరావడం ఎంత తెలివితక్కువ.

—ఇంక ఒక్క క్షణంకూడా ఉండకూడ దనుకుంది

రాధికనీ పాపనీ స్టేషన్‌కి దిగబెట్టి వచ్చి దిగులుగా కూచుంది కల్యాణి

"ఏమిటలా ఉన్నావ్?" కరుణ అడిగాడు.

"రాధికసంగతి నాకేం తెలియడంలేదండీ ఆవేశంతో వచ్చింది. ఉద్రేకంతో వెళ్ళి పోతోంది. దీని బ్రతుకేమవుతుందో!?"

"ఆగ్నేస్‌కు ట్రాన్స్‌ఫర్ అయిఉంటుంది. ఈపాటికి మచిలీపట్నం చేరే ఉండాలి."

"మచిలీపట్నమా ?"

"ఆయన జయరాంలేడూ . వాళ్లన్నయ్య ఇన్సూరెన్స్‌లో పెద్ద ఆఫీసర్ అతను చేయిస్తానన్నాడు ఈ బదిలీ . ఇంతకీ వాళ్ళా యనదగ్గరకు మీ చెల్లెలు వెళ్ళిపోతే నీకు దిగులెందుకు ? భర్తను తనవాణ్ణి చేసుకునే చాకచక్యం ఆడదానికుండాలి "

మరో నాలుగురోజులకి రాధిక ఉత్తరం రాసింది. కరుణముందు చదివి ఇంట్లోకివచ్చి లడిగాడు ''కల్పన ఎవరూ ?''

''ఇంతకీ ఏం రాసింది ?''

''గ్రేస్‌కు బదిలీ అయిపోయిందట. అంతా కులాసా అని రాసింది. కల్పనకు పెళ్ళయిందా అని రాసింది. కల్పనెవరూ ?''

''ఎవరో కల్పనలెద్దురూ, దాని బ్రతుకు ఏమౌతుందోనని భయపడ్డాను. హమ్మయ్య. ఇంక బెంగలేదు.''

కల్పన గురించి చెప్పనేలేదు కళ్యాణి భర్తకి.



## భజగోవిందాన్ని గురించి

శైవులు పరమేశ్వరుణ్ణే తప్ప మరొక దేవుణ్ణి అంగీకరించరు. వైష్ణవులకు విష్ణువు తప్ప మరొక దేవుడు లేనేలేడు. అద్వైతుల పద్ధతి అది కాదు. వారికి నిర్గుణోపాసనే ప్రధానం. అయినా, పరిపక్వ దశ వచ్చేవరకూ సగుణోపాసన అవసరమే అని వారి భావం. శివకేశవు లిద్దరూ వారికి సమానులే! అందుకోసమే ఆయన భజ గోవింద స్తోత్రాన్ని చెప్పవలసి వచ్చింది.

శరీరం నిత్యం కాదనే విషయాన్ని మరిచిపోయి, సంసార వ్యామోహంలో పడినవారు జీవనార్థం లౌకిక విద్యలను నేర్చుకోవడం పరిపాటి. పూర్వం సంస్కృతంలో ఉన్న శాస్త్రవిద్యలకే ప్రాధాన్యం ఉండేది. తర్క, వ్యాకరణ, వేదాంతాది శాస్త్రాలకు నాటికీ, నేటికీ కూడా కాశీ ప్రసిద్ధి చెందింది. ఆ శాస్త్రపండితులు ఆస్థాన విద్వాంసులుగా ఉండి, మహారాజులచేత పోషింపబడుతూ

## ధర్మపథం

ఉండేవారు. అందువల్ల అవి జీవనాధారాలయి ఉండేవి.

ఒకప్పుడు ఒక వ్యాకరణ విద్యార్థి ఆ నగరంలో గురువుగారి గృహ వేదికపై కూర్చుండి ధాతుపాఠాన్ని కంఠస్థం చెయ్య సాగాడు. కరణార్థాన్ని – అంటే చేయుట అనే అర్థాన్నిచ్చే '(డు)కృఞ్' ధాతువును – దాని అర్థంతోపాటు 'డుకృఞ్ కరణే' అని ఎన్నో సార్లు గుడ్డిపాఠంగా వల్లెవేస్తూ ఉన్నాడు. ఆ సమయంలోనే ఆదిశంకరులు శిష్యులతో కూడా గంగానదికి స్నానార్థం ఆ మార్గంగా వెళ్లడం సంభవించింది. అందువల్ల శంకర భగవత్పాదుల చెవులో ఈ "డుకృఞ్ కరణే" ఎన్నోసార్లు పడింది. మూఢుడై పరమును గమనించక ఇహం కోసం పరిశ్రమ చేస్తున్న ఆ వ్యక్తికీ, తన్మూలంగా లోకానికి జ్ఞానప్రదమైన ప్రబోధాన్ని ఇస్తూ 'గోవిందునే సేవించు' అని హితబోధ చేస్తున్న 'భజ గోవింద' స్తోత్రాన్ని చెప్పవలసి వచ్చింది. దాని ప్రారంభం

'భజ గోవిందం, భజ గోవిందం
గోవిందం భజ మూఢమతే,
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి నహి రక్షతి డుకృఞ్ కరణే.'

'ఓ మూఢమతీ! నీకు మరణకాలం ఆసన్నమైనపుడు ఈ 'డుకృఞ్ కరణే' నిన్ను రక్షించదు. అందువల్ల తరుణోపాయాన్ని చింతించి గోవిందుడైన శ్రీహరిని సేవించు' అని దీని భావం. ఈ విధంగా ఆయన సులభ పద్ధతిలో ద్వాదశ మంజరికాస్తోత్రాన్ని చెప్పగా వారి శిష్యులు కూడా ఒక్కొక్కరూ హితాన్ని బోధిస్తూ ఆ స్తోత్రాన్ని పూర్తిచేశారు.

ఇంపైన తత్త్వబోధకమైన ఈ స్తోత్రం చాలా మందికి కంఠస్థమే! అయినా ఏ సందర్భంలో ఇది చెప్పబడినదీ చాలామందికి తెలియక పోవచ్చును. ఆ విషయం దీనివల్ల అందరూ తెలుసుకోగలరు.

—బులుసు వేంకటరమణయ్య

---

## హైదరాబాద్ నోట్ బుక్

### కేంద్ర విశ్వవిద్యాలయ భవనాలు

హైదరాబాదు విశ్వవిద్యాలయ భవనాలకోసం 10 లక్షల రూపాయలు మంజూరుచేశారు. ప్రస్తుతం రెండు తరగతి భవనాలు, పాలన భవనం, రెండు విద్యార్థి వసతి గృహాలు నిర్మిస్తారు. 2200 యకరాల విస్తీర్ణంలో ఈ విశ్వవిద్యాలయం మరొక పట్టణంగా పైకిలేస్తుంది దీనికి మంజీరానది నీటి సరఫరా వుంటుంది. దేశమంతటికీ అత్యుత్తమ గ్రంథాలయం దీనిలో వుంటుంది. పుస్తకాలకోసం దాదాపు 30 లక్షలు ఖర్చుచేస్తారు. 40 లక్షల రూపాయలు విలువ చేసే సైన్సు పరికరాలు తెప్పిస్తారు. 1980 నాటికల్లా ఇది సంపూర్ణ రూపం ధరించి' దేశంలో చాలావాటికి మార్గదర్శక మవుతుందని వైస్‌ఛాన్సలర్ గురుబక్ష్‌సింగ్ తెలిపారు.

### ఓరుగంటి వెంకటసుబ్బయ్య కాలధర్మం

సుప్రసిద్ధ స్వాతంత్ర్య యోధుడు శ్రీ ఓరుగంటి వెంకటసుబ్బయ్య ఏప్రిల్ 1 వ తేదీన పరలోకగతులయ్యారు. ఈయన వయస్సు 94 సంవత్సరాలు. దాదాపు శతాబ్దం జీవితం గడిపిన పాతతరం నాయకుల కోవ ఈయన అస్తమయంతో అంతరించిందనే చెప్పాలి. ఈయనలోని విశేషం, ఈయన పరివారమంతా దేశభక్తులయి త్యాగమయ జీవితం గడపడమే. వెంకటసుబ్బయ్య 1906లోనే స్వదేశీ దీక్షకు పూనుకొని, నెల్లూరు జిల్లా కావలిలో మొట్టమొదటిసారిగా బాలికా పాఠశాలను స్థాపించారు. 1917 లో హోంరూల్ ఉద్యమంలో నెల్లూరు జిల్లా హోంరూల్ లీగ్ అధ్యక్షులయారు. న్యాయవాద వృత్తి వదలుకొన్నారు, నెల్లూరు జిల్లాకాంగ్రెస్ సంఘాధ్యక్షులై సత్యాగ్రహోద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. నాలుగుసార్లు కారాగారవాసం అనుభవించారు. ఆయనతోపాటు ఆయన సతీమణి శ్రీమతి మహాలక్ష్మమ్మ, కుమారులు వెంకటేశ్వరశర్మ, డాక్టర్ రామచంద్రయ్య (ఆంధ్ర విశ్వవిద్యాలయం చరిత్ర శాఖ మాజీ అధ్యక్షులు) కారాగారం' అనుభవించారు. రామచంద్రయ్య కాకినాడ బాంబుకేసులోను ముద్దాయి. వెంకటసుబ్బయ్య వివిధ రంగాలలో, సంఘసంస్కరణోద్యమంలోను, జాతీయ పాఠశాలల స్థాపనలోను, జాతీయోద్యమం వివిధ ఘట్టాలలోను నెల్లూరు జిల్లాలో నాయకత్వం వహించని కార్యక్రమమంటూ లేదు, 1927 న తుపాను సంభవించినప్పుడు, తర్వాత కలరా మహామారి విజృంభించినప్పుడు జిల్లా సంఘాలకు అధ్యక్షులయి అపార సేవ చేశారు. అవిభక్త మద్రాసు రాష్ట్రంలో రాజగోపాలాచారి నాయకత్వాన తొలిసారిగా ఏర్పడిన కాంగ్రెస్ ప్రభుత్వంలో శాసన సభ్యులుగా ఎన్నికయి ఎంతో సేవచేశారు. ఈయన మరుగైపోవడంతో కాశీనాథుని నాగేశ్వరరావు, కొండా వెంకటప్పయ్య, బులుసు సాంబమూర్తి, టంగుటూరి ప్రకాశం గార్ల కోవ కాలగర్భంలో లీనమైపోయింది.

### 'సుందరదాసు' బిరుదు

జంటనగరాల రామభక్తులు, ఆకాశవాణి శ్రోతలను తమ మధురాతిమధుర సుందరకాండ గానంతో అలరింపచేస్తున్న శ్రీ ఎం. ఎస్. రామారావును ఏప్రిల్ 6వ తేదీన రవీంద్రభారతిలో సిర్డిసాయి ప్రేమమందిరం యాజమాన్యంలో జరిగిన సన్మాన సభలో సాంస్కృతిక సంక్షేమ శాఖామంత్రి శ్రీ బాట్టం శ్రీరామమూర్తి "సుందరదాస్' బిరుదంతో సత్కరించారు. శ్రీయుతులు విద్యామంత్రి కృష్ణారావు, రామారావు రచించిన సుందరకాండను ఆవిష్కరించినవిద్యాశాఖ కార్యదర్శి సి. ఎస్. శాస్త్రి, ఆర్థికశాఖా కార్యదర్శి బి. పి. ఆర్. విఠల్, డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, గుడిపూడి శ్రీహరి, పాలగుమ్మి విశ్వనాథం, కళాసుబ్బారావు మొదలయినవారు రామారావు గానసుధా మహిమను ప్రశంసించారు.

### కీర్తిశేషుడు ప్రొఫెసర్ సుబ్బారావు

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో మహామేధావిగా, పరిపాలనదక్షుడుగా, విద్యార్థి ప్రియుడైన ఆచార్యుడు గా, ప్రాచీనగురుకులాచార్య సన్నిభుడుగా విఖ్యాతుడైన ప్రొఫెసర్ ఎస్. వి. సుబ్బారావు ఏప్రిల్ 5వ తేదీన అర్ధరాత్రి గుండెపోటులో పర

(46వ పేజీ చూడండి)

**జేబులు తడుముకుని, పేంట్ కుడి జేబులోంచి సిగరెట్ పెట్టె బయటకు తీసాను.**

కొత్త పేకెట్ అది. దానికున్న సెలిఫోన్ పేపర్‌ని విప్పి, కిటికీలోంచి బయటకు జార విడిచాను. పెట్టె తెరిచి, లోపలవున్న తగరం ముక్కని కూడా తీసి, నలిపి ఉండలా చేసి, కిటికీలోంచి బయటకి విసిరేసాను. సిగరెట్‌లు వరసగా పేర్చబడి వున్నాయి పెట్టెలో.

"సిగరెట్ ?" అడిగాను నా మిత్రుడిని, ఒక దాన్ని పైకి లాగి. నా మిత్రుడు మునివేళ్లతో దాన్ని అందుకుని పెదాల మధ్య ఇరికించాడు.

నేను సిగరెట్ అందుకుని, పెట్టె సీట్‌కి ఆనుకునివున్న నా సూట్‌కేస్ మీద పడేసి, లైటర్‌తో రెండు సిగరెట్లు వెలిగించాను. రెండు దమ్ములు లాగి, పొగ వదులుతూ చూసాను నా ఎదురుగా కూర్చునున్నతని వంక, అప్పుడు.

సిగరెట్ పొగలోంచి కొద్దిగా పరిశీలనగా నన్నే చూస్తున్నాడు. అంతదాకా పేపర్ చదువుతున్న అతను. నేను సిగరెట్ పాకెట్ విప్పినప్పటి నుంచి నావంకే ఓరగా చూడటం గమనిస్తున్నాను.

"సిగరెట్ తీసుకోండి" సూట్‌కేస్ మీద వున్న పాకెట్‌ని అతనివైపు తోస్తూ అన్నాను.

పెదాలు విడివడకుండా నవ్వాడతను. తల అడ్డంగా వూపుతూ అన్నాడు.

"తాగను"

నేను కిటికీలోంచి కనపడుతున్న కొండ వంక చూస్తూండిపోయాను. కొండ అంచు మీద ఓ చిన్న గుడి, తెల్లటి సున్నం వేసిన గోడలు. చాలాచోట్ల కొండలమీద అలా చిన్న చిన్న గుళ్లు కనబడుతూంటాయి రైల్లో ప్రయాణం చేస్తూంటే. చుట్టు ప్రక్కల ఎక్కడో చిన్న పల్లో, గ్రామమో వుంటుంది అనుకున్నాను.

అతను సిగరెట్ తాగుతున్న నన్ను ఇంకా చూస్తూండటం గమనించి అడిగాను.

"ఆర్పేయనా ?"

"మీకు సిగరెట్ పొగ పడదా ?" నా మిత్రుడుకూడా అడిగాడు.

అతను ఇందాకటిలాగే నవ్వాడు పెదాలు విడివడకుండా. మళ్లీ తల అడ్డంగా వూపి అన్నాడు.

"తాగండి."

నేను మళ్లీ కిటికీలోంచి బయటకి చూడసాగాను. కొండ కిందవున్న చిన్న చిన్న గుడిసెలముందు నాలుగైదు మేకలు తిరుగుతున్నాయి. చాలా చిన్న పల్లె అనుకున్నాను. నిముషంలో పల్లె మాయమయింది నా దృష్టిలోంచి. మళ్లీ కలుసుకొని విడిపోతున్న టెలిగ్రాఫ్ తీగలు.

"పన్నెండేళ్లయింది నేను సిగరెట్ తాగి" అన్న మాటలు వినబడ్డాయి. అతనివైపు చూసాను. నా మిత్రుడితో చెప్తున్నాడుఅతను.

"సరిగ్గా పన్నెండు సంవత్సరాల మీద నాలుగు నెలలయింది నేను సిగరెట్ తాగి."

"అలవాటుంటే తాగండయితే" అన్నాను నేను.

ఇందాకటిలాగే నవ్వుతూ, తల అడ్డంగా వూపి అన్నాడు అతను.

"ఇక తాగనని ఒట్టు పెట్టుకున్నాను."

"ఏం ?" అడిగాడు నా మిత్రుడు.

"సిగరెట్ అంటే విరక్తి కలిగి."

"ఎందుకు కలిగింది ?" మళ్లీ అడిగాడు నా మిత్రుడు.

"అయినా మానకలిగారా ?"

"అవును." అని ఆగి చెప్పాడు. "అంతకు మునుపు రోజుకి ఇరవై సిగరెట్లు తాగుతూండేవాడిని."

"రోజుకి ఇరవై ? ఒక్కసారిగా విరక్తి ?"

నా మిత్రుడు తన చేతిలోని సిగరెట్ వంక ఆలోచనగా చూస్తూ అన్నాడు.

"ఏం జరిగింది ?" అడిగాను.

అతను కిటికీలోంచి కొన్ని క్షణాలు బయటకి చూస్తూండిపోయాడు. అకస్మాత్తుగా నా వైపు తిరిగి అడిగాడు.

"చెప్పమంటారా ?"

తల వూపాను చెప్పమన్నట్లుగా.

"నా పేరు వల్లభరావు. నా మిత్రుడి పేరు కొద్దిగా గమ్మత్తుగా వుంటుంది నా పేరు లాగానే. లోకోత్తమరావు."

"మీ స్నేహితుడు కూడా వస్తున్నారా?" చూసాను. అతను వంటరిగా వున్నట్లుగా కనబడ్డాడు.

తల అడ్డంగా వూపాడు తనకి అలవాటయిన ధోరణిలో నవ్వి.

"పన్నెండేళ్ల నాలుగు నెలల క్రితం సంగతి చెప్తున్నాను. ఇప్పుడు వంటరిగానే వెళ్తున్నాను మద్రాస్‌కి."

"చెప్పండి" అన్నాను నేను కూడా నవ్వి.

"నాకుఇరవైనాలుగు.లోకోత్తమరావునాకు అప్పట్లో ఎంతో సన్నిహితుడు. వాడికీ ఇరవైనాలుగే. నేను సిగరెట్స్ తాగేవాడిని. వాడు కాదు." అని నవ్వాడు అతను.



## మృత్యువు బంధువు

నేనూ నవ్వాను, వింటున్నానన్నట్లుగా. నేను సిగరెట్ మరో దమ్ములాగాక చెప్ప సాగాడు, మళ్ళీ నవ్వకుండా, ఎక్కడా ఆపకుండా.

"సిగరెట్స్ నాకు కాలేజీ రోజుల్లోనే అల వడ్డాయి. సరదాకి తాగడం మొదలు పెట్టాను. మొదటి సిగరెట్ అగ్రికల్చరల్ బి. ఎస్సి. లో చేరిన మొదటిరోజు ముట్టించాను. బి. ఎస్సి. పూర్తయ్యేసరికి రోజుకి అరేడయినా కాలుస్తే కాని బ్రతకగలిగేవాడిని కాను. అలా మొదలయింది సిగరెట్ అల వాటు."

అక్కడ చెప్పటం ఆపి అన్నాడు నాతో వల్లభరావు. "రైలు వేగం తగ్గుతోంది. స్టేషన్ వస్తుందేమో?" కాని రైలు మళ్ళీ వేగం పుంజుకుంది వెంటనే.

"సిగ్నల్ అయి వుండవచ్చు. చెప్పండి" అన్నాడు నా స్నేహితుడు.

"ఇంట్లో క్రమంగా తెలిసిపోయింది. సిగరెట్, మద్యంలాంటి అలవాట్లు ఎక్కువ కాలం దాగాలన్నా దాగవు. ఇంతలో అదృష్ట వశాత్తు బేంక్‌లో వుద్యోగం వచ్చి చేరి పోయాను. మద్రాస్‌కి వుద్యోగరీత్యా చేరు కున్నాను, ఇల్లు వదలి. సిగరెట్లు తాగద్దు అని తిట్టే నాన్నగారు దగ్గర లేకపోవడంవల్ల సిగరెట్ల సంఖ్య పెరిగింది.

లోకోత్తమరావు పరిచయం అయాడు నాకు. బ్యాంక్‌లో అతను కూడా క్లర్క్. అతనికి సిగరెట్ పొగ అంటే ఎంత మాత్రం పడదు. నాకు అది లేకుండా పని చెయ్యటం సాధ్యం అయేది కాదు. చూడండి ఎంత విచిత్రమో. ఇద్దరివీ పక్క పక్క సీట్లు. మాటి మాటికి సిగరెట్ కోసం బయటకు వెళ్ళడం కూడా బాగుండదు.

పాపం. మంచివాడు. అందుకే సహించే వాడు. సిగరెట్స్ తాగద్దని మొత్తుకునేవాడు. తనకు సరిపడదని కాదు. నా ఆరోగ్యం దెబ్బతింటుందని, ఎన్నోసార్లు, లెక్కలేనన్ని సార్లు నన్ను సిగరెట్ మానమని కోరాడు.

సిగరెట్ మానడానికి ప్రయత్నించి మొదటి సారిగా తెలుసుకున్నాను, నేను దానికి ఎంతగా బానిసనయిపోయానో. తగ్గించడానికి ప్రయత్నించి, దానికికూడా విఫలుడయ్యాను. అప్పటికి రోజుకి ఇరవై కాల్చే స్థితికి చేరుకున్నాను.

ఎన్నో ప్రయత్నాలు చేసాడు లోకోత్తమ రావు. ఓ రోజంతా సిగరెట్ తాగకపోతే సిని మాకి తీసుకెళ్తానని చెప్పేవాడు. నేను ఓ రోజు ఎన్ని తక్కువ తాగితే అన్ని రూపాయలు ఇస్తానని ఆశ పెట్టేవాడు. సిగరెట్ తాగితే కాన్సర్‌లాంటి మృత్యువు బంధువులు ఎంత త్వరగా దగ్గరవుతాయో చెప్పి భయపెట్టే వాడు. సిగరెట్ మానేస్తే ఇంటికి డబ్బు ఎక్కువ పంపించవచ్చని బోధించేవాడు. అంద మయిన అమ్మాయిలకి సిగరెట్ అంటే అసహ్య మని వుదాహరణలు చూపించేవాడు."

చెప్పటం ఆపాడు వల్లభరావు.

ప్రతి ఒక కప్పులోను
100% పరిశుద్ధమైన
కాఫీని ఇచ్చే
న్స్టెంట్ కాఫీ ఒక్కటే!

# ఇది.




కారణం ? నూటికి నూరు పాళ్ళు పరిశుద్ధమైన కాఫీని ఇచ్చేది నెస్కాఫే ఒక్కటే. దక్షిణ భారతదేశంలో లభ్యమయ్యే అత్యుత్తమమైన కాఫీ గింజలతో తయారైనది. పరిశుద్ధమైన డికాక్షన్ కాఫీకి ఉండే కమ్మని సువాసనను, తృప్తికరమైన రుచిని అనుభవించండి. నెస్కాఫే త్రాగండి.



A NESTLÉ product

# నెస్కాఫే

—100% పరిశుద్ధమైన కాఫీతో తయారయ్యే
ఒకే ఒక్క ఇన్స్టెంట్ కాఫీ

NNCM-21 TEL

# మృత్యువు బంధువు

"అప్పుడే మానేస్తే ఎంత బావుండేది ?" అన్నాడు విచారపడుతున్నట్లుగా.

"తర్వాత ?" అడిగాను.

"ఎప్పుడు మానేసారు ?" అడిగాడు నా మిత్రుడు.

"ఎందుకు మానేసారు ?" మరో తోటి ప్రయాణికుడు కూడా అడిగాడు ఆసక్తిగా. అతనూ వింటున్నాడు మాలాగానే.

పెద్దగా నిట్టూర్చి మళీ వల్లభరావు చెప్పసాగాడు.

"విపరీతంగా ప్రయత్నించాను. నా అశక్తతకి నేనే బాధపడేవాణ్ణి. లోకోత్తమరావు నా స్నేహితుడైన సంవత్సరానికి ఇరవైనుంచి పన్నెండు సిగరెట్లకి తగ్గించగలిగాను రోజుకి.

ఓ రోజు, ఆ తర్వాత ఓ రోజు, నేను, లోకోత్తమరావు పందెం వేసుకున్నాం ఆదివారం. ఆ రోజంతా నేను సిగరెట్ తాగక పోతే పది రూపాయలు నాకిస్తాడు. లేకపోతే నేను ఇవ్వాలి, మధ్యలో తాగితే అయిష్టంగానే వప్పుకున్నాను పందేనికి. భోజనం అయే దాక, మధ్యాహ్నం పన్నెండున్నరదాకా కోరికని చంపుకున్నాను. నాదగ్గరే, నా గదిలో కాపలా వున్నాడు లోకోత్తమరావు. మధ్యాహ్నం మూడింటికి ఇక ఆగలేకపోయాను, కాఫీ తాగాక. కాఫీ తాగాక సిగగెట్ లేకపోతే కాలం గడవటం కష్టం నాకు. క్షణాలు గంటలవు తాయి. తల పగిలిపోతున్నట్లుగా వుంటుంది."

"నాక్కూడా" అన్నాడు నా స్నేహితుడు.

వల్లభరావు నవ్వి మళ్ళీ చెప్పసాగాడు.

"కాఫీ తాగాక చెప్పులు తొడుక్కొని, సిగరెట్‌కోసం వెళ్తున్నాననీ, ఓడిపోయానని" చెప్పాను. నన్ను చెయ్యి పట్టుకుని ఆపి, అయిదుదాకా ఆగితే పందెం గెలిచినట్లే అని చెప్పాడు. మరో పావుగంట తర్వాత ఇక సిగరెట్ లేకపోతే వుండలేననిపించింది.

లోకోత్తమరావు తిట్టాడు. 'బానిసవి, కంట్రోల్ లేని వాడివి' అని ఎత్తిపొడిచాడు. నాకు అప్పటికే తల తిరగడం ప్రారంభించింది. మంచంమీద పడుకున్నాను. లోకోత్తమరావుకి కొద్దిగా జాలి కలిగింది నా మీద. తనే తెస్తానని, నన్ను కదలద్దనీ వెళ్ళాడు. ఇక ఎప్పటికీ తిరిగిరాలేదు."

"కోపం వచ్చిందా ?"

"పావుగంట తర్వాత ఎవరో వచ్చి చెప్తే బయటకి పరిగెత్తాను. నా రూమ్‌కి వంద గజాల దూరంలోవున్న కిళ్ళీకొట్టు దగ్గరికి చేరుకున్నాను. సరిగ్గా ఆ కిళ్ళీకొట్టుముందు, సిగరెట్స్ కోసం రోడ్ దాటుతూ లారీక్రింద పడ్డాడు లోకోత్తమరావు"

వల్లభరావు చెప్పటం ఆపాడు. నేనూ, నా మిత్రుడు, మరో శ్రోత, ముగ్గురం నిశ్శబ్దంగా వుండిపోయాం. ఎవరూ ఏం మాట్లాడలేకపోయాం. నా మిత్రుడుమాత్రం సిగరెట్‌ను బయటకు విసిరేసాడు కిటికీ లోంచి.

" లోకోత్తమరావు చచ్చిపోలేదు. " చిరునవ్వుతో చెప్పాడు వల్లభరావు మాకు, మా మొహాల వంక చూసి "చచ్చిపోలేదు. రోడ్డు దాటుతూండగా లారీ వచ్చింది: లారీ రావడం చూచి, కిందపడ్డ లోకోత్తమరావు పక్కకి దొర్లాడు. కుడికాలి మీద నుంచి పోయింది లారీ చక్రం. నేను వెళ్ళే సరికి స్పృహలేకుండా పడివున్నాడు. రక్తం కారుతొంది తెగిన కాలులోంచి రోడ్డంతా మడుగు కట్టి వుంది రక్తం అతని చుట్టూ. ఎంతో బాధవేసింది నాకు. లారీ డ్రయివర్ లారీ ఆపకుండా పారిపోయాడు.

"ఆ క్షణంలో నాకు కనపడిందల్లా రక్తంతో తడిసి పడివున్న లోకోత్తమరావు, నాకోసం కొందామనుకున్న సిగరెట్ పాకెట్. పక్కన కూర్చుని నిశ్శబ్దంగా ఏడవసాగాను. మా సందులోని డాక్టర్‌ని తీసుకువచ్చారు ఎవరో. వెంటనే ఆస్పత్రికి తీసుకు వెళ్ళమని చెప్పాడు ఆ డాక్టర్ పరీక్ష చేసిచూసి. జనరల్ హాస్పిటల్ దగ్గరే కాబట్టి అక్కడికి చేర్చాం. మధ్యలో స్పృహ వచ్చింది లోకోత్తమరావుకి. బాధతో కేకలు వేస్తూనే వున్నాడు దారిలో. అబ్బ ! ఎంత హృదయ విదారకంగా అరిచాడు !! ఆ బాధ నాకింకా గుర్తుంది. ఆ అరుపులు ఇంకా నా చెవుల్లో వినబడతాయి. ప్రయత్నిస్తే. ఎప్పటికీ మర్చిపోలేని అరుపులవి."

"వాటె ట్రాజడీ" అన్నాడు నా మిత్రుడు.

"ఆ తర్వాత నేను సిగరెట్ ముట్టలేదు." చెప్పాడు వల్లభరావు.

"పన్నెండు సంవత్సరాల నాలుగు నెలలయిందా ఇదంతా జరిగి?" అడిగాడు తోటి ప్రయాణీకుడు.

అవునన్నట్లుగా తల వూపి చెప్పాడు వల్లభరావు.

"మనస్సు విరిగిపోయింది ఆసంఘటనతో. అంతకు మునుపులేని నిశ్చయం, విల్ పవర్ నాలో ప్రవేశించాయి, నాకు తెలియకుండానే. అసలు నేను సిగరెట్ మానేసిన సంగతి ఎవరో చెప్తేనేగాని తెలియలేదు నాకు. అంత విరక్తిగా అనుకోకుండానే మానేశాను."

"నేను మానేస్తాను" అన్నాడు నా మిత్రుడు.

నవ్వుకున్నాను. వల్లభరావుకి ఆనందాన్ని కలిగించడానికి చెప్పే మాటలవి.

"సిగరెట్స్ మృత్యువుల బంధువులు" అని వల్లభరావు మళ్ళీ పేపర్ అందుకున్నాడు

నేను మాత్రం మరో సిగరెట్ అందుకోకుండా వుండలేకపోయాను. బేసిన్ బ్రిడ్జి దగ్గరయేలోగా.

* * *

"అనంతగిరికి రావడం ఇదే ప్రథమం." తనని తను పరిచయం చేసుకొని చెప్పాడు.

## నిజం — అబద్ధం

ఎల్ మాలకొండయ్య

నిజం, నిజం
ఏది నిజం?
ఎవరు చెప్పుతారు నిజం
ఎవరు నమ్మతారు నిజం.
అబద్ధం అబద్ధం
ఆహా, ఎంత తీపి.
ఆ మాటలోనే ఉంది అందం
ఆ పలుకులోనే ఉంది మకరందం
చెప్పేవారా?
కోకొల్లలు
వినేవారా?
వెతకనక్కరేలేదు
ఎదురు చూస్తుంటారు
చెవులు విప్పుకుని
కళ్ళుమూసుకుని
"ఎద్దు ఈనిందంటే
గాటకట్టివెయ్యండి" అనడానికి
అబద్ధం ఎంత తీపో
నిజం అంత చేదు.
నిజం ఎంత నగ్నం!
అబద్ధం ఎంత అందాల వేషధారి!
నిజానికి నిజమంటే
కళ్ళు మూసుకుంటారు
నగ్నాన్ని చూసే ధైర్యం లేక
అబద్ధం అంటే పరిశోధిస్తారు
భూతద్దాలు ధరించి
లేనివాటిని కూడ వెతకడానికి
గోరంతలను కొండంతలు చేయడానికి

# ఈ వేసవిలో ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది?




ఎక్కడ పేలినప్పటికీ, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి. ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ఋజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది.

- చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది.
- క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది.
- చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణ [illegible]నము చేకూరుస్తుంది.

స్నానము తదుపరి మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి. అది ఒక్కటే ఔషధీయుక్తమైన పౌడరు; చెమట పేలుడు నుంచి ఉపశమనమును కల్గించేది—తక్షణమే.

చందనపు సువాసనలో గూడా దొరుకుతుంది.




## ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.

* Trademark © J&J 75

Johnson & Johnson

OBM-4317/R Tel

# మృత్యువు బంధువు

ఆ మెడికల్ రిప్రజెంటేటివ్. మరో పావు గంటదాకా తనతో తెచ్చిన మందులు చూపిస్తూ, వాటి వుపయోగం చెప్పాడు, నర్స్ వచ్చి గుర్తు చేసింది నాకు, రౌండ్స్ టైం అయిందని.

మెడికల్ రిప్రజెంటెటివ్‌కి క్షమాపణ చెప్పి బయలుదేరాను రోగులని చూడటానికి. ఒకొక్క రోగినే చూడసాగాను. వాళ్లని పరీక్షించి, కొంతమందిలేటెస్ట్ ఎక్స్‌రేలని పరికీలించి, రోగులకి ధైర్యం చెపుతూ తిరగ సాగాను శానిటోరియం.

ఆంధ్రప్రదేశ్‌లో, ప్రభుత్వంచే నడపబడే క్షయరోగ చికిత్సాలయంలో నేను డాక్టర్‌గా పనిచేస్తున్నానన్న సంగతి మొదట చెప్పలేదను కుంటాను ? వికారాబాద్‌కి అతి దగ్గరలో వుంది ఆ ఆసుపత్రి.

ఆ రోగి దగ్గరికి చేరడానికి గంటపైనే పట్టింది. నవ్వుతూ పలకరించాడు.

''హలో డాక్ ?''

''హలో.'' అన్నాను ప్రతిగా నవ్వుతూ. ఆ రోగి దాదాపు చివరి దశ చేరుకున్నాడు. ఎక్కువ రోజులు బ్రతకడనుకుంటాను. సిగరెట్స్ ఎక్కువగా తాగడంవల్ల అతనాస్థితికి వచ్చాడు.

నాలుగు నెలల్రితం రైల్లో వల్లభరావు తారసపడ్డప్పుడు చెప్పిన సంఘటన, నేను ఇద్దరు ముగ్గురు సిగరెట్స్ తాగేవాళ్లకి చెప్పాను అప్పటికే.

''ఒక సిగరెట్ సేంక్షన్ చేయించండి డాక్టర్. ఎలాగయినా చచ్చిపోయేవాడ్నేగా. పిచ్చిగా వుంటోంది ఇక్కడచేరి, సిగరెట్స్ తాగడం ఆపేసి నప్పటినుంచి.''

తల అడ్డంగా వూపాను.

''ఎలా అలవాటయింది?'' అడిగాను రొటీన్‌గా. కొత్తగా చేరిన ఆ రోగిని ఆ ప్రశ్న అడగడానికి అంతదాకా అవసరం ఏర్పడ లేదు నాకు.

''ఒంటరితనాన్ని పారద్రోలడానికి.''

''ఎవరూలేరా మీకు ?''

''చాలామంది వున్నారు. ఓ చెల్లెలు, ఆ చెల్లెలిని ప్రేమించి పెళ్లి చేసుకున్న మిత్రుడు ఇంకా చాలామంది.''

''మరి ?''

''నేనూ అందరిలా వుంటే సిగరెట్ అలవాటు చేసుకుని వుండేవాణ్ణి కాను.''

''అంటే ? ఎందుకు అందరిలా లేరు ?''

''మీకు తెలియదా అయితే ?''

అతను దుప్పటి లాగాడు కాలితో. దుప్పటి పక్కకి తొలగిపోయింది. అప్పుడు చూసాను. ఎడంకాలు మాత్రమే వుంది ! కుడికాలు లేదు !! కుంటివాడు !!!

''చిన్న ఏక్సిడెంట్‌తో ఈ కాలు పోయి పుష్కరం దాటింది. అప్పటితో అలవాట యింది అక్కడ. క్రమంగా రోజుకి ముప్పై దాకా పెరిగాయి. ఇక్కడ చేరడానికి ముందు ఎన్నివేలు కాల్చివుంటానో మీరే లెక్కవేసు కోండి, ఆ మృత్యువు బంధువుల్ని.''

''మీ పేరు ?'' అడిగాను చార్ట్‌లో అతని పేరు కోసం చూస్తూ.

అతను చెప్పకుండానే తెలిసిపోయింది నాకు అతని పేరు చార్ట్ ద్వారా.

లోకోత్తమరావు అతని పేరు !!

ఈ సారి కూడా పురుడు ఆస్పత్రిలోనే పోసు-కుంటారా!!

కాదు ఆఫీసులోనే పోసుకుందామను కుంటున్నా! మా మేనేజరు సెలవు ఇవ్వనన్నాడు!!

రాగతి పండరి



వడ్లమన్నాటి లక్ష్మీప్రసన్న

కొత్త సీరియల్ ప్రారంభం

**అప్పుడే వరండాలో కడుగుపెట్టిన విశాలాక్షమ్మ...తెరచిన గేటుగుండా కనిపిస్తున్న ఎదుర్రింటి పడుచుజంటను చూసి ముచ్చటపడి... వారి సరస సంభాషణాన్ని ఆసక్తితో ఆలకించ సాగింది.**

"ఏయ్ పిల్లా! స్కూటరెక్కమ్మా. .అంటే . గారాలు ... నయగారాలు పోతావేం? ఎత్తి సీటు మీద కుదెయ్యమంటావా?" ,

"అబ్బ! రోజా స్కూటరు ... షికారు ... ఒకటే బోరు ... ఎందుకొచ్చిన హైరాన బాబూ ఇదంతా! ఎంచక్క! ఇంట్లో కూర్చునో . డాబాపైనో ... హాయిగా కబుర్లు చెప్పుకుంటే పోలా...! శ్రమ ... పెట్రోలు దండగ రెండూ తప్పుతాయిగా!"

"అబ్బబ్బ! యీ ఆడవాళ్ళతో అన్నీ పేచీలే! స్కూటరు వచ్చేటంతవరకూ రాలేదని గోల! వచ్చిన తర్వాత రానేనని గోల! సరే దేవిగారూ! మీరు ఇంట్లోనే వుండి గోడలతోనూ, గిన్నెలతోను కబుర్లు చెప్పుకోండి! నేనలా ఝామ్మంటూ పోయి . .షాపింగు చేసుకొని.. "

"ఆఁ! ఏవిటీ? షాపింగా?! నేను లేకుం డానే... ! ఏం తెచ్చుకుంటారేవిటి అబ్బాయిగారు? షర్టింగ్ క్లాతా...సూటింగు క్లాతా?!"

"కాదు చీరలు. రకరకాల చీరలు ... ఫాషన్ చీరలు..."

"అయితే కొత్త చీరలు రకరకాల డిజైన్లలో షాపులోకి వేంచేశాయన్నమాట! ఓహో అదా అయ్యగారి హుషారు! మరి చెప్పరేం? ఏవండీ! ఏవండీ! నేనూ వస్తానండీ...మీతోపాటు బజారు . షాపింగుకి. ."

"అబ్బే! వద్దండీ! అమ్మడుగారూ! స్కూటరుమీద బజారు వెళ్ళటం మహా బోరను కోండి! అంతేగాదండోయ్! శ్రమ ... మరియు పెట్రోలు దండగ ... ఏవంటారు?"

"అహ! ఏం ఎత్తిపొడుస్తారులెండి! తీసు కెడుదురూ! ఎలాగూ ముస్తాబయి వున్నాగదా! ఆఁ! కూర్చున్నాగానీ .. త్వరగా పోనియండి! అవతల చీరలు అయిపోతాయేమో కొట్లో?! అదీగాక ... ఆ ఎదురింటావిడ లేదూ?! ఆవిడ మనల్ని వింతగా చూస్తోందిందాకటినుంచీ ఎవరీ పబ్లిక్ సరసాల పక్షులన్నట్లుగా...!"

చివరి మాటలా అమ్మాయి యెంత చిన్నగా అన్నా ... విశాలాక్షమ్మకు వినిపించనే వినిపించాయి. సన్నగా నవ్వుకుంది. తనలో తాను. మరుక్షణంలో బుర్రుమని చప్పుడు చేసుకుంటూ స్కూటరు తుర్రుమంది. ప్రపుల్ల వదనంతో ఆ జంట వెళ్ళిన వేపలాగే చూస్తూ నిల్చుంది విశాలాక్షమ్మ.

## కళా విశారద

రెండుసార్లు "ఊర్వశి" బిరుదాన్ని తనదిగా చేసుకున్న మన శారదకు పద్మశ్రీ ఘంటసాల మెమోరియల్ మ్యూజికల్ అకాడమీ తెనాలి వారు "కళా విశారద" బిరుదాన్ని ఇచ్చి ఏప్రిలు 14 వ ఘనంగా సత్కరించారు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ నన్నపనేని వెంకట్రావు "కళావిశారద"గా శారదని సన్మానించారు.

## * సినిమావిశేషాలు *

తెలుగు చిత్రరంగంలో శారదకు ప్రత్యేక స్థానం వుండడానికి కారణం ... మహిళాలోకం ఎక్కువగా ఆదరించడమే.

ఇంతవరకు శారద నటిగా ఏ చిత్రంలో తక్కువ చేసింది ? ప్రతి పాత్రలో జీవించినట్టుగా నటించగల మహాశక్తి శారదకు వుంది. శారదగారి వుత్తమ నటన్ను "మనుషులు మారాలి...శారద... బలిపీఠంలో అరుణ, రాధమ్మ పెళ్లిలో రాధ, జీవితం, ప్రేమలు...పెళ్లిళ్లు" చిత్రాల్లో ప్రజలు మెచ్చుకున్నారు.

**కొత్త చిత్రాలు !**

ప్రస్తుతం శారద అయిదు కొత్త చిత్రాలలో నటిస్తున్నారు. "నటసమ్రాట్"తో మహాత్ముడు... శ్రీనివాసా ఏజన్సీస్ చిత్రం,

"శీలానికి శిక్ష"లో శారద



***

"నా పేరే భగవాన్"లో మంజుల



***

"నిజం నిద్రపోదు"లో సుమిత్ర



## కను విప్పు

ఎదురింట్లోకి కొత్తగా వచ్చారా నవదంపతులు. అతను స్టేట్ బాంక్‌లో పని చేస్తున్నాడని పక్కింటి పార్వతమ్మ చెప్పగా వింది తను. టైముప్రకారం పని...ఆకర్షణీయమైన జీతం...దానికితోడు కొత్త జీవితం. అందువల్లనో ఏమో...ఎప్పుడూ చిరునవ్వు చిందే ముఖంతో హుషారుగా వుంటాడు. ఆ అమ్మాయికూడా బి. ఏ. చదువుకుందట. చురుకుగా చలాకీగా వుంటుంది.

విశాలాక్షమ్మకు వారితో పరిచయమైతే లేదు గానీ ... సాయంత్రంపూట ఆ జంట ... కార్యక్రమాన్ని అలవోకగా పరిశీలించటం అలవాటుగా పెట్టుకుంది. అతను సాయంత్రం బాంకునుంచి వచ్చే టైముకు ... అందంగా ... ఆకర్షణీయంగా ముస్తాబై కలలుగనే కళ్లతో ఎదురుచూస్తుంటుందా అమ్మాయి. కాసేపట్లో అతని స్కూటరు హుషారుగా ఇంటి ముందాగుతుంది. సంతోషమంతా ముఖంనిండా పులుముకుని "హాయ్!" అంటే "హాయ్!" అని పలకరించుకుంటారు నేటి ఫాషన్‌కు అనుగుణంగా. స్కూటరు వాకిట్లోనే వుంచి ... తాళమేసి...ఆమెతోసహా లోని కెడతాడు. పది నిముషాలు గడిచేసరికి సరికొత్త ముస్తాబుతో ఆ అమ్మాయితోసహా తిరిగి తయారవుతాడు స్కూటరు దగ్గరకు. వారిద్దరూ కిలకిలా నవ్వుతూ తుళ్లుతుంటుంటే చిలకాగోరింకలు పలకరించుకున్నట్లుంటుంది.

అతనిచేత బతిమాలించుకుని మరీ స్కూట రెక్కాలని ఆమె సరదా! చివరకు ఆమెచేతే బతిమాలించుకుని ... స్కూట రెక్కించుకోవటం అతని చాకచక్యం !

* * *

"అమ్మగోరూ ! అబ్బాయిగోరికోసరమేనా తవరలా నిలుసుని సూత్తుండారు ! వత్తారులెగండి! ఆఁ! అన్నట్టు ఇయ్యాల అన్నంలోకేం కూర సేయమంటారు."

రాజమ్మ పిలుపుతో యీ లోకంలో పడింది విశాలాక్షమ్మ. రాజమ్మ ఆ యింట్లో వంటమనిషే కాదు, పనిమనిషి గూడాను. వంటపని, ఇంటిపని చాలా ఓపికగా చేస్తుంది. పని ఎంత ఎక్కువగా వున్నా ... ఎంత తొందరపెట్టినా విసుక్కోదు ... కసుక్కోదు. ఓపికగా చేసుకుపోతూనే వుంటుంది. చాలా నమ్మకస్తురాలవటంవల్ల... నా అనే వారెవరూ లేకపోవటంవల్ల ఇరవైనాలుగ్గంటలూ తనదగ్గరే వుంచుకుంటుంది విశాలాక్షమ్మ. రాజమ్మ తిండి బట్ట... చిల్లర ఖర్చులూ అన్నీ తనే భరిస్తుంది. రాజమ్మ తనకంటే పెద్దదవటంవల్ల ఓ రకమైన అభిమానంగూడా వుంది విశాలాక్షమ్మకు. అందుకనే రాజమ్మను ఏమే ఒసే అని పిలవదు.

"అవును రాజమ్మా! వాడికోసమే! వాడింకా రాలేదు. ఏ స్నేహితులతో ఏం కబుర్లతో మునిగి పోయాడో ఏమో ?" కొడుకుమీద ఆపేక్షను ప్రదర్శించుకుంది విశాలాక్షమ్మ.

"అమ్మగోరూ! తవరే మనుకోనంటే ఓ సిన్నమాట."

"చెప్పు రాజమ్మా!" రాజమ్మ సలహాలు తనకు నచ్చుతాయనే నమ్మకం వెల్లివిరుస్తోందామె మాటలలో.

"అబ్బాయిగారికో బంగారు బొమ్మలాంటి కోడలుపిల్లను సూసి ముడెట్టేశారనుకోండి ! అప్పు డబ్బాయిగోరు స్నేహితులంటూ బజారులో ఇంతసేపు తిరుగాడుకోరుగా ? కాలేజీ ఒగ్గయ్యగానే ఇంటికి లగెత్తుకొత్తారుగా !!"

"అవును రాజమ్మా! నువ్వన్నది అక్షరాలా నిజం! ఆఁ! దాని సంగతి నే నాలోచిస్తాగానీ ... ఏం కూర చెయ్యమనికదూ అడిగావ్! ఉల్లిపాయ ముక్కలు బాగా వేసి...కాకరకాయముక్కలు కోసి... నూనెలో వ్రరగా వేయించు. రఘుకా కూరంటే ప్రాణం." తన ఆలోచనల కంతరాయం కలగగూడదన్నట్లుగా రాజమ్మకు పని పురమాయించింది విశాలాక్షమ్మ.

"అలాగే నమ్మగోరూ! సిటికెలో సేసేత్తాను." రాజమ్మ వంటింట్లోకి నిష్క్రమించింది. అక్కడున్న వాలుకుర్చీలోకి మేను చేరవేసింది విశాలాక్షమ్మ.

* * *

అవును — రఘు యీ మధ్య కాలేజీనుంచి నేరుగా యింటికి రావటంలేదు. స్నేహితులతో కబుర్లు షికార్లతో కొంతసేపు గడిపి సాయంత్రం ఆరు ఏడింటికిగాని కొంపకు చేరటంలేదు. తన రఘుకేం తక్కువ ? చక్కగా వుంటాడు పచ్చని పసిమిచాయతో. తగినంత ఎత్తు ... దానికి తగిన లావు...వుంగరాల జుట్టుతో...కొనదేలిన ముక్కుతో

(32వ పేజీ చూడండి)

# పెరిగే ప్రతి దశలోనూ శరీరానికి కావాలి
# కాల్షియం-శాండోజ్®



కాల్షియం, గర్భంలోని శిశువు ప్రధమ దశలోనే పాప పళ్ళలోనూ, ఎముకలలోనూ చేరు కోవటం మొదలెడుతుంది. పుట్టబోయే శిశువుకు శీఘ్రగతిలో ఎక్కువగా కాల్షియం కావాలి. అందుకే, మీకు మామూలు కన్న రెండు రెట్లు కాల్షియం కావాలి. మీరు తొందర గానే కాల్షియం-శాండోజ్ తీసు కోవటం మొదలెట్టండి.



పాప ఎముకలు, పళ్ళూ పటిష్టత కోసం కాల్షియం లభించేది పాలిచ్చి పెంచే తల్లి ద్వారానే. ఆమెకు మామూలుకన్న మూడు రెట్లు కాల్షియం అవసరం.

పెరిగే పాపకు పటిష్టమైన ఎముకలూ, గట్టి పళ్ళ కోసం కాల్షియం ముఖ్యావసరం. అందుకే, పెద్ద వాళ్ళ కన్న, పాపకు కాల్షియం ఎక్కువగా కావాలి!





కాల్షియం ప్రతి దశలోనూ, ప్రతి వయసులోనూ, శరీరానికి కీలకమైన అవసరం. మరి కాల్షియం-శాండోజ్‌లో, కాల్షియం ఉత్తమోత్తమైన రూపంలో ఉంది. రోజుకు రెండు సార్లు, రెండు లేదా మూడు రుచిగల, రాస్ప్ చెరీ-వాసన గల కాల్షియం-శాండోజ్ బిళ్ళలు, మీకు అవసరమైన కాల్షియం యిస్తాయి. దానితో బాటే విటమిన్ సి, డి మరియు బి$_{12}$.

**శాండోజ్‌ను విశ్వసించండి-ప్రపంచమంతటిలో కాల్షియం తయారీలో అగ్రగాములు.**




## కాల్షియం-శాండోజ్®
## బిళ్ళలు ప్రతి రోజూ ప్రతి వారికీ

dCA/CS/15 F TEL.



"సెక్రటరీ"లో ఒక దృశ్యం

కృష్ణతో ఉదయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వారి చిత్రం,

రామకృష్ణతో "శీలానికి శిక్ష" చిత్రం, దాసరి దర్శకత్వంలో "ఇదెక్కడి న్యాయం" చిత్రం.

"నటరత్న" రామారావుగారితో శారద త్వరలో ఒక చిత్రంలో పని చెయ్యొచ్చు ఆమెకుకూడా ఆ మహానటుడితో చెయ్యాలని వుంది.

(గత సంవత్సరం తాతినేని ప్రకాశరావుగారి "సంసారం" చిత్రంలో శారద కాల్‌షీట్లు కుదరక, చెయ్యలేకపోయింది.)

### నిడదవోలులో శారద

ఒక నెలరోజులు మదరాసుకు దూరంగా శారద వుండాల్సి వచ్చింది. సావరిన్ సినీ ఎంటర్‌ప్రైజస్ వారి "శీలానికి శిక్ష" చిత్రం షూటింగు నిడదవోలు, రాజమండ్రి, విజయవాడ, పురుషోత్తమపల్లె, అంతర్వేది మున్నగుచోట్ల జరిగింది.

"గోదావరి"లో రెండు పాటల చిత్రీకరణ జరిగింది "శీలానికి శిక్ష" చిత్ర నాయిక అగు శారద నెలరోజులు ఏకధాటిగా షూటింగులో పాల్గొంది.

నిడదవోలుకు యిరవైఅయిదుమైళ్ళ దూరాన భీమవరం వుంది. అక్కడ వెలసిన "మావుళ్లమ్మ"కు శారద సాష్టాంగ నమస్కారంచేసి, ఆ దేవతకు వేయి దండాలు పెట్టింది

### వేలమంది వచ్చారు !

"మావుళ్లమ్మ" గుడికి శారద వచ్చిన వార్త వూరంతా ప్రచారం జరిగిందేమోగాని, పది నిమిషాల్లో వేలమంది ఆమెను చూడడానికి వచ్చారు. శారదపట్ల తమకున్న ప్రేమాభిమానాలను ప్రదర్శించారు.

శారదను చూడడానికి వచ్చిన వాళ్లలో స్త్రీలు అధిక సంఖ్యలో కవిపించారు.

ఒక అరవైఏళ్ల వృద్ధురాలు శారదను సమీపించి నుదుట ముద్దిడిన సంఘటన ఆమె జీవితంలో మరువలేనిది.

### మావుళ్లమ్మ మహిళ

భీమవరంలో వున్న మావుళ్లమ్మ మహాశక్తి సంపన్నురాలని, కోరికలు తీర్చే దేవతని శారదకు గట్టి నమ్మకం ఏర్పడడానికి కారణం లేకపోలేదు

"శారద ... దేవుడు చేసిన పెళ్లి" చిత్రాల షూటింగు జరుగుతున్న సమయాన శారద "మావుళ్లమ్మ" ఆశీస్సులను అర్థించింది. ఆ రెండు చిత్రాలు అమోఘ విజయాన్ని చవిచూచాయి. మళ్లీ "శీలానికి శిక్ష" చిత్రానికి "మావుళ్లమ్మ' దర్శనభాగ్యం శారదకు లభించింది

### శ్రీ ఉమా ప్రొడక్షన్స్ !

ఒక హిట్ హిందీ చిత్రాన్ని తెలుగులో నిర్మించ దలచినట్టు పాఠకులకు తెలిపాను. ఆ చిత్రం పేరేమిటని అనేకులు అడుగుతున్నారు. నిర్మాత పుష్పాభట్‌గారిని అడిగాను "దాగ్" అని చెప్పారావిడ.

రాజేష్‌ఖన్నా, శర్మిలా, రాఖీ ధరించిన పాత్ర

## సినిమా

లను తెలుగులో శోభన్‌బాబు, జయసుధ, జయప్రద పోషించగలరని, నిర్మాతల్లో ఒకరయిన ఎన్. ఎన్. భట్ చెప్పారు.

సెప్టెంబర్ నుంచి షూటింగు ప్రారంభం అవుతుందని, డిశంబరుకల్లా చిత్ర నిర్మాణం పూర్తవుతుందని కథానాయక పాత్రధారి హీ-మాన్ చెప్పారు.

ఈ చిత్రానికి చక్రవర్తి సంగీతాన్ని, సత్యానంద్ రచన్ను, సుందరం ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తారు.

ఈ చిత్రానికి వెరైటీ చిత్రాల దర్శకుడు మధుసూదనరావు డైరెక్షన్ చేపట్టారు. అన్నపూర్ణా పిలింస్ విడుదల.

### కలర్‌లో మహేశ్వరి చిత్రం

దైవముందనేవాళ్లకన్నా, దైవం లేదని వాదించే వాళ్ల సంఖ్యే అధికంగా కన్పిస్తూంది నేడు. అలాంటి వాళ్లకు గుణపాఠం చెప్పేదెలా! అధర్మం, అన్యాయం అవధులు దాటినపుడు, వాటిని అరికట్టడానికి దైవం వివిధ రూపాల్లో అరుదెంచి, మానవ కోటి మధ్య సామరస్యాన్ని, పెంపొందింప చేయడం తన కర్తవ్యంగా భావించడం ఆనాటి నుంచీ ఈ నాటి వరకూ మనం చూస్తూనే వున్నాం.

పాపాల కుహరమైన నేటి కలియుగంలో, అట్టి పాపాలను తొలగించగల శక్తి ఆ శక్తి స్వరూపుణికి వుందనే సత్యం నిత్యం నిరూపింపబడుతున్న నిజం ఆ నిజాన్ని సోదాహరణంగా కథల రూపేణ జనులకు చిత్రం ద్వారా తెలియచేయ నిశ్చయించి, నిర్మింపబడిన చిత్రమే "మహేశ్వరీ మహాత్మ్యం."

కె ఆర్ విజయ మహేశ్వరిగా నటిస్తున్న యీ చిత్రానికి యం. అరుళ్‌సెల్వం నిర్మాత. ఆంధ్రా, ఒరిస్సా, నార్దరన్ ఇండియా మహేశ్వరీ ఫిలిమ్స్ ద్వారా, సీడెడ్‌లో సూర్యా ఫిలిమ్స్ ద్వారా, నైజాంలో నటేష్ ఫిలిమ్స్ ద్వారా యీ చిత్రం విడుదలౌతుంది



"ముద్దబంతి పువ్వు"లో అల్లు, మాడా

### అక్కినేని "చక్రధారి" !

ఎన్నో వుత్తమ పాత్రలను విశిష్టంగా పోషించి యిప్పటికీ "ఏ...వన్" అనిపించుకుంటున్న అక్కినేనికి మరొక మంచి పాత్ర వెతుక్కుంటూవచ్చింది.

లక్ష్మీఫిలిం కంబైన్స్ నిర్మిస్తున్న "చక్రధారి" వర్ణ చిత్రంలో పాండురంగ భక్తుడుగా నాగేశ్వర రావు నటిస్తున్నారు. మధుర భక్తిరస పూరితమైన "చక్రధారి" పాత్ర, అక్కినేనికి యిష్టపాత్రగావడం ప్రేక్షకులకు ఆనందమే గదా.

ఒకప్పుడు స్వర్గీయ నాగయ్య నటించిన "చక్రధారి" యిప్పుడు విడుదలయినా, విశేషంగా ఆకర్షిస్తున్నదంటే, కథలో ఎంత విషయం వుండాలి.

"ఆనాటి అందాలగుమ్మ... గొల్లభామ" సమర్పించు "చక్రధారి" చిత్రానికి ఆత్రేయ రచనను, వెంకటేష్ సంగీతాన్ని, రెహమాన్ ఛాయను, వాలి కళను. కోటగిరి గోపాలరావు కూర్పును నిర్వహించగలరు.

విక్టరీ మధుసూదనరావు దర్శకత్వంలో తయారయ్యే "చక్రధారి"లో వాణిశ్రీ, జయప్రద, రమాప్రభ, సత్యనారాయణ, రాజబాబు, అల్లు రామలింగయ్య, ప్రభాకరరెడ్డి మరియు గుమ్మడి ముఖ్యపాత్రధారులు.

ఆగస్టు 16 నుంచి అన్నపూర్ణా స్టూడియోస్‌లో "చక్రధారి" షూటింగు జరుగుతుంది.

### జయప్రద కోరిక

"బంగారు చిలక"గా పేరుతెచ్చుకున్న జయప్రదను "దేవుడే దిగివస్తే" శతదినోత్సవ సభలో అక్కినేని ఆశీర్వదిస్తూ, ప్రశంసించారు. తన అభిమాన కధానాయకుడు నాగేశ్వరరావుతో నటించాలన్న కోరిక జయప్రదకు వుండేది ఆమె కోరిక నెరవేరింది. "గొల్లభామ" తలపెట్టిన "చక్రధారి" చిత్రంలో అక్కినేని సరసన జయప్రద నటిస్తూంది

### దాసరి ముద్దబంతి

ఒక అభాగిని వ్యధల కధ, ఒక సహనశీలి కరుణ కధ — అదే "ముద్దబంతిపువ్వు" చిత్ర కధ సహనానికి మారు పేరు స్త్రీ అంటారు. ఇది నిజం కాకపోతే సహనానికీ సరిహద్దు వుండాలిగా కొందరు కొన్నాళ్లు, ఇంకొందరు కొన్నేండ్లు, మరికొందరు జీవితాంతం కష్టాలనే కడలిలో పయనిస్తూ, సహనమనే శక్తితో ఎదురీత చేస్తుంటారు

ఇలా కొన్నాళ్లు, కాదు కొన్నేండ్లు వెతలను విస్మరించి, బ్రతుకు నావను నడపడంకన్నా, బ్రతికినంతకాలం సహనంతో సమస్యలనే వలయంలో పరిభ్రమిస్తూ, పరిష్కరిస్తూ ముందుకు సాగిపోయే సాహసిక యువతి గాధే "ముద్దబంతిపువ్వు" చిత్ర కధా కధనం.

స్టార్ డైరెక్టర్ దాసరి దర్శకత్వం, గడుసరి సంభాషణలు, స్క్రీన్‌ప్లే, కధల నిర్దేశకత్వం "ముద్దబంతి పువ్వు" చిత్రాన్ని ముచ్చటగా తీర్చిదిద్దాయి. ముద్దబంతిగా జయచిత్ర నటించిన ఈ చిత్రంలో సత్యనారాయణ, మురళీమోహన్, అల్లు రామలింగయ్య, ఈశ్వరరావు, మోహన్ బాబు మరియు విజయలలిత ముఖ్య పాత్రధారులు. దాసరి కీర్తికిరీటంలో మరో పసిడి పాదుగే "ముద్దబంతి పువ్వు" చిత్రం.

పోతిన శ్రీరాములు సమర్పణలో ఆర్. సుబ్బారావు, యం. జగన్మోహనరావు నిర్మించిన యీ చిత్రానికి రమేష్‌నాయుడు సంగీతం, కె. యస్ మణి ఛాయ, భాస్కరరాజు కళ, బాలు కూర్పు సమకూర్చారు. పూర్ణా ద్వారా ఏప్రిల్‌లో విడుదలకు సిద్ధమౌతూంది యీ చిత్రం.



"జ్యోతి"లో ఒక సన్నివేశం

ఈ చిత్రంలో సత్యనారాయణ, మురళీమోహన్, జయచిత్ర తమ తమ పాత్రలను బహుధా ప్రశంసనీయంగా యెలా పోషించారో రమేష్ తన పాత్రనుకూడా ఏమాత్రం తక్కువగా పోషించలేదు. సంగీత బాణీలు కట్టడంలో సమర్థుడు రమేష్ నాయుడు అని "ముద్దబంతిపువ్వు" చిత్రంలోని పాటలు విడుదలకుముందే నిరూపిస్తున్నాయి.

### స్వర్గానికి నిచ్చెనలులో తెంగాయ్

తమిళ చిత్ర రంగంలో హాస్య నటుడిగా ప్రత్యేక ప్రశంస లందుకుంటున్న తెంగాయ్ శ్రీనివాసన్ తొలిసారిగా ఫిల్మాలయ కంబైన్స్ వారి "స్వర్గానికి నిచ్చెనలు" చిత్రంలో ఒక ముఖ్య పాత్రను పోషిస్తున్నాడు. నాగేష్ నటన తెలుగువారు మెచ్చారు అందుకే నాగేష్ అనేక తెలుగు చిత్రాలలో ప్రధాన పాత్రల్లో కన్పిస్తున్నారు ఈ చిత్రంతో తెంగాయ్‌కు కూడా డిమాండ్ పెరుగుతుందేమో చూడాలి మరి

నేలమీద నిలబడి నింగికి నిచ్చెనలు వేయడంలో అర్ధంలేదు అర్హతలేని అంతస్తులను కోరుకోవడం వ్యర్ధమే అవుతుంది ఈ నిజానికి నిదర్శనమే "స్వర్గానికి నిచ్చెనలు" చిత్రంలోని పాత్రల రూప కల్పన తమాషా చేయడం హమేషా సరదా అనుకోవడం పొరబాటు. ఒక్కోసారి ఆ సరదా సమస్యగా మారే అవకాశం లేకపోలేదు. అదెలా సాధ్యమో "స్వర్గానికి నిచ్చెనలు" చిత్రం చూస్తే బోధపడుతుంది మనకు

గోపాలకృష్ణ డైరెక్టు చేసిన మొదటి చిత్రం "లక్ష్మణరేఖ" అతన్ని గ్యారంటీ దర్శకుడిగా నిరూపించింది. అలాంటి ప్రతిభాశాలి నిర్దేశకత్వంలో తయారవుతున్న చిత్రమే "స్వర్గానికి నిచ్చెనలు." సంభాషణలకు సముద్రాల, సంగీతానికి మహదేవన్ వుండనే వున్నారు. రామచంద్రన్, పంజు అరుణాచలం నిర్మిస్తున్న యీ చిత్రంలో రామకృష్ణ, జయచిత్ర, ప్రభ, చంద్రమోహన్, ఎస్. వరలక్ష్మి, నిర్మల, పుష్పకుమారి, బేబి సుమతి, రమామాలిని ముఖ్య తారాగణం తారకరామా విడుదల.



"దశావతారములు"లో జయచిత్ర

# కాకులని

జి.రజని



సుమా'' అన్నది ఇంటిగలావిడ వరలక్ష్మమ్మగారు. సత్యభామా వామాక్షి ఆవిడ మాటల్ని ఏకగ్రీవంగా ఆమోదించారు.

అప్పటికి మగవాళ్ళు బయటకి వెళ్ళిపోయారు. భానుమతి, ఆవిడతో వచ్చినతనూ గదికి తాళం వేసుకు వెళ్ళిపోయారు. శివరామయ్యగారికి ఆ రోజు అన్ని ఆధరువుల్లోను ఉప్పు కొంచెం ఎక్కువగా పడ్డట్టు అనిపించింది. అయినా భార్యని ఏనాడూ అననివారవడం చేత భోజనం ముగించి ప్రైవేట్లు చెప్పడానికి వెళ్ళారు.

''అసలు ఈ వుద్యోగాలుచేసేఆడవాళ్ళకి వాళ్ళ వెంట ఓ మగాడిని తిప్పుకోవడం ఫాషను పిన్నిగారూ. అందుకే ఇళ్ళల్లో కూర్చునే ఆడపిల్లల కిచ్చినంత గౌరవం వీళ్ళ కివ్వరు'' అంది సత్యభామ.

''పెళ్ళిళ్ళు చేసుకుంటే సంసారమూ పిల్లల బెడదాయె. ఇలా చాటు మాటుగా తిరుగుతూ కోరికలు చల్లార్చుకుంటారులా ఉంది'' అంది కామాక్షి చంటాడిని చంకనేసుకుంటూ.

ఆ తరవాత సంభాషణ అంతా ఈ తీరుగానే నడిచింది. భూమ్మీద ఉన్న అవినీతి నంతా భానుమతికీ, ఆవిడతో వచ్చినతనికీ అంటగట్టి కొంత సంతృప్తి పడ్డారు.

వరసగా మూడు రోజులూ ప్రొద్దున్నా సాయంత్రం భానుమతి ఉండే వేళల్లో వస్తూనే ఉన్నాడు అతగాడు. ఉన్నంతసేపూ గది నవ్వులూ కేకలతో నిండిపోతూ ఉండేది.

అతని రాకపోకల్ని శ్రద్ధగా గమనిస్తూ ఉన్నారు ఆ ఇంట్లో అందరూ. వాళ్ళ మాటల్ని వినడానికి ఆడవాళ్ళు ప్రయత్నించారు గాని వాళ్ళు ఇంగ్లీషులో మాట్లాడుకుంటుండటంవల్ల వాళ్ళ ప్రయత్నాలు ఫలించలేదు. సత్యభామ తను ఏనాడో చదివిన ఎస్సెల్సీ పరిజ్ఞానంతో వీటిని అర్థం చేసుకోవడానికి నానా తంటాలూ పడేది.

''ఏం మాట్లాడుకుంటున్నారేవిటి అమ్మాయి''. అని అడిగేది వరలక్ష్మమ్మగారు. ఆ సమయంలో ఆవిడకి వాళ్ళు తనకర్థంకాని భాషలో మాట్లాడుకుంటున్నందుకు విపరీతమైన కోపం వచ్చేది.

కామాక్షి తను చదువుకోనందుకు విచారించేది.

''సినిమాలలో నవలల్లో ఉండే ప్రేమనిగురించి చెప్పుకుంటున్నారల్లే ఉంది పిన్నిగారూ'' అనేది సత్యభామ. అ.. నిజమో కాదో తనకే తెలియని పరిస్థితిలో. వెంటనే పిన్నిగారు ఓ చెయ్యి నడుంమీదేసు

''మీరు గట్టిగా వార్నింగివ్వకపోతే లాభంలేదు. ఉండదలుచుకుంటే బుద్ధిగా మసలుకొమ్మనండి అంతేగాని ఇలా ప్రవర్తిస్తుంటే మనం ఉండలేం.''

రెండ్రోజులుగా కృష్ణమూర్తి తనని తరచు విసుక్కుంటుండడం జ్ఞాపకంవచ్చింది సత్యభామకి.

వాళ్ళిద్దరినీ చిరునవ్వుతో చూసింది వరలక్ష్మమ్మగారు.

''నేనూ అదే నిర్ణయించుకున్నాను. ఇది మర్యాదస్తుల కొంపమ్మా ! నీ రాసకేళీలు మరో యింట్లో సాగించుకుంటే ఉభయత్రా మంచిది అని చెప్పి చక్కారామా.'' అంటూనే హుటాహుటిని భానుమతి గదివైపు నడిచింది.

ఆవిడ్ని చూస్తూనే ఆహ్వానించింది భానుమతి ''రండి'' అంటూ.

''నేను కూర్చోవటానికి రాలేదమ్మా ! ఇక్కడ మర్యాదగా సంసారాలు చేస్తున్నవాళ్ళం. నీవరస నాకేం నచ్చలేదు. ఏదో ఒంటరిగా వున్నావుకదా పాపం అని యిక్కడ వుండనిచ్చాను. అదేం నిలువు కునేట్టులేవు.'' వరలక్ష్మమ్మగారి వాక్ప్రవాహానికి అంతంలేదు.

భానుమతి స్థాణువులా అలానే చూస్తూ నిలబడింది. చివరకి ''మీరనేదేమిటి'' అని మాత్రం అనగలిగింది. ఆ యువకుడి ముఖంలో మార్పులేదు. పైగా చిరునవ్వుతో చూస్తూండటం చూసి వరలక్ష్మమ్మగారికి మండింది.

''ఏమయ్యా. సిగ్గైనా తెలియదూ ఇలా పరాయి ఆడదానితో తిరుగుతావా. నువ్వెవరివో నాకు తెలియదు కాని ఇలా ఆడపిల్లల వెంటబడి తిరగడం మంచిదికాదు బాబూ. అది గౌరవమైన పని కాదు. ఏదో వయసు పొంగులో ఇలాగే అన్పిస్తుందనుకో. నా మాటవిని మీ అమ్మా నాన్న చూసిన పిల్లని పెళ్ళి చేసుకో నాయనా. చూడబోతే బుద్ధిమంతుడిలా ఉన్నావు'' అంటూ ఉపదేశం చేసింది.

ఆవిడ అన్న మాటలు అతనికి ఒక్కటీ అర్థం అయినట్టు లేదు. ఆవిడవైపు ఆశ్చర్యంగా చూసి భానుమతిని హిందీలో ఏదో ప్రశ్నించాడు.

భానుమతి ఏదో లోకంలోనుండి బయట పడ్డట్టు అతనివైపు చూసి హిందీలోనే ఏదో జవాబు చెప్పింది. వరలక్ష్మమ్మగారు వాళ్ళిద్దరివైపూ అయోమయంగా చూసింది.

''మీరంత భయపడనవసరంలేదు పిన్నిగారూ'' అంది భానుమతి

''ఏవిటి'' కొంచమైనా జంకని భానుమతిని ఆవిడ విసు పోతూ చూసింది.

పొద్దు కరకరా పైకి పొడుచుకొస్తున్న సమయంలో —

బావి గట్టుమీద కాకులు అరుస్తున్నాయి. తులసికోట చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణంచేసి సూర్య నమస్కారం చేయడానికి కళ్లు తెరిచిన వరలక్ష్మమ్మగారికి భానుడైతే కన్పించలేదుకాని భానుమతి మాత్రం కనిపించింది వెంటనే ఆవిడ ఏదో మహా ఉపద్రవం జరిగినట్టు ఫీలయిపోయింది దానికి కారణం భానువతి కాదు భానుమతి పక్కన నడుస్తున్న భారీ విగ్రహం అనిపించే మగ వ్యక్తీ కాదు వాళ్లిద్దరిమధ్యా వున్న ఉల్లాసపూరితమైన వాతావరణం అలా కలసిరావడం ఆవిడకి అబ్బురం అన్పించింది

భానుమతి అతనితో ఏదో నవ్వుతూ చెబుతూ తన గదిలోకి దారి తీసేంత వరకూ అటే చూస్తున్న వరలక్ష్మమ్మగారు సూర్యనమస్కారాల మాట మర్చిపోయింది

పాతకాలపు మండువా వున్న ఆ యింట్లో మూడు వాటాలు వరసగా వున్నాయి ఓ వాటాలో కృష్ణమూర్తి అన్నాభార్యలతో కాకుండా ఏకపత్నీ వ్రతుడిగానే వుంటూ హైస్కూల్లో పనిచేస్తున్నాడు స్కూల్ టైములో తప్ప మిగిలినరోజంతా భార్య కొంగు పట్టుకోనే యింట్లో తిరుగుతూంటాడు అందుకని ఆ ఇల్లాలికి వరలక్ష్మమ్మగారు సత్యభామాదేవని పేరెట్టింది

వరలక్ష్మమ్మగారికి పుట్టింటి తరపున ఆ యిల్లు కలిసింది రిటైరయి అయిదేళ్లవుతున్నా శివరామయ్యగారు ముప్ఫయ్యేళ్ల కాపరంలో ఏనాడూ ఆవిడ మాటకి ఎదురుచెప్పి ఎరగరు ఉన్న ఒక్క కూతురుకి పెళ్లిచేసి పంపారు ఇల్లరికం తెచ్చుకోవాలని వరలక్ష్మమ్మగారికి వున్నా కూతురే ఒప్పుకోక పోవడంతో ఆవిడ కోరిక తీరలేదు

మూడో వాటాలో వుండే వామాక్షిని ఆమె సంతానాన్ని మొదట చూసినప్పుడు హడిలి జోహారు లర్పించిన శివరామయ్యగారు కారణకర్త అయిన ఆ గుమాస్తా జీవిని కుచేలరావని పిలుస్తుంటారు

శివరామయ్యగారి దంపతులు వుంటున్న వాటాకి ఆనుకుని పెరటివైపు బావి గట్టు పక్కగా వున్న గదిలో భానుమతి వుంటోంది భానుమతి ఆ ఊళ్ళోనే ఓ ఆఫీసులో స్టెనోగా పని చేస్తోంది

వరలక్ష్మమ్మగారు మరో అరగంట వరకూ తేరుకోలేకపోయింది ఆ తరవాత "అప్ప! కలికాలం వచ్చిపడింది" స్వగతం చెప్పుకుని బుగ్గలు వాక్కుకుంటూ పక్కకి తిరిగేసరికి దాదాపు ఆవిడ స్థితిలోనే వున్న తక్కిన జనం కనిపించారు

మొగుడికి త్వరగా అన్నం వండిపెట్టాలని హడావిడిగా కూరలో పోపు పెడుతూన్న సత్యభామ కూడా వాళ్లవైపే చూస్తూ "ఉద్యోగాలుచేసే ఆడవాళ్లింతే కాబోలు" అనుకుంది పోపు మాడిన వాసన మరో అరగంటకి ఆవిడ నాసికాపుటాలకి చేరగలిగింది

షేవింగు చేసుకుంటున్న కృష్ణమూర్తి ఆ నూతన వ్యక్తి అదృష్టాన్ని తలుచుకొని నిట్టూర్పులు విడిచే ప్రయత్నంలో బ్లేడు తన చెంపను ముద్దెట్టుకుందన్న స్పర్శజ్ఞానమే లేకుండాపోయింది

పిల్లాడికి పాలిస్తూ ఆడపిల్లకి జడవేస్తున్న వామాక్షి ఓ క్షణం భానుమతివైపు చూసి "పెళ్ళీ పిల్లలూ లేనివాళ్లు ఇంతేకాబోలు ఏ యిందూటమూ లేకుండా హాయిగా తిరుగుతుంటారు" అనుకునేంతలో అయిదో పిల్లా ఆరో పిల్లాడూ ఎందుకో దెబ్బలాడుకుంటూ తీర్పుకోసం తల్లి దగ్గర కొచ్చారు అసలే మూడ్‌లో లేని వామాక్షి వాళ్లని నాలుగిచ్చుకోవడంతో మరుక్షణంలో ఇల్లెగిరి పోయింది

పాతకాలపు సైకిలు బాగుచేసుకుంటున్న కుచేలరావు భానుమతివైపు దృష్టి మంచి చూసి ఆ ఆగంతకుడు అడగకపోయినా "తిరిగితే తిరిగావు కానీ పెళ్లి మాత్రం చేసుకోకు నాయనా! అంతకంటే సముద్రంలో ఈదడం సుఖం అనుకో" అని ఉచిత సలహా చెబుదామనుకుని ఇంట్లో వెచ్చాల ఖర్చు జ్ఞాపకం రాగానే ఎవర్ని అప్పు అడగాలా అన్న ఆలోచనలో ఆ విషయం మర్చిపోయాడు.

"చూశారూ రోజు లెట్లా మండిపోతున్నాయో మునుపు మా కాలంలో మగాళ్ళవైపే చూడడం తప్పుగా ఉండేది వాళ్ళు అంత దూరంలో ఉండగానే హడలి చచ్చేవాళ్ళం ఇప్పటి వాళ్ళకి ఆ తీరువేది బరితెగించి పోతున్నారు మరీను ఈ భానుమతికి అసలు గదివ్వడమే పొరపాటు అయింది అంతకంటే ఏముంటుందిలే. ఏదో కుర్ర తనంలో యిలాంటి వేషాలు వేస్తారు. పెద్దవాళ్లకి తెలీకుండా యిలా ప్రేమ పెళ్లిళ్లు చేసుకొని తరువాత విడిపోతున్నవాళ్లని ఎంతమందిని చూడటం లేదు మనం" అంటూ ధారావాహికంగా యిచ్చే స్పీచ్‌ను ఇద్దరూ శ్రవణానందంగా విన్నారు.

"ఇలా ఎంతకాలం మనం భరించేది పిన్నిగారూ! పక్కన కాపరాలు చేసుకుంటున్న వాళ్లమాయె" వాపోయింది వామాక్షి, క్రితంరోజు మొగుడు అకారణంగా కొట్టిన దెబ్బలు తలచుకుని.

సత్యభామ దానిని బలపరిచింది.

"మేం చిన్నప్పుడంతా క్రొత్తగాదిసే ఉన్నాం నాకిక్కడ ఆంధ్రలో ఉద్యో... రావడంతో ఇక్కడకు వచ్చేశానుగానీ మా విశ్వానికయినా ఇంకా కొత్త ఉద్యోగం. ఇల్లు దొరకక తన స్నేహితుడి ఇంట్లో ఉంటున్నాడు. ఇల్లు దొరికాక వెళ్లిపోతాంలెండి"

వరలక్ష్మమ్మగారు పిచ్చిచూపులు చూసింది.

"ఇంతకీ ఈ అబ్బాయి .... " ఆవిడతో మాట్లాడటం ఇష్టంలేనట్టు వెనక్కి తిరిగింది భానుమతి. "మా అన్నయ్య". బావి గట్టుమీద కాకులు అరవడం మర్చిపోయి నిశ్శబ్దంగా ఉన్నాయి.



'ప్రేమ మందిరం'లో భారతి



''రాజు వెడలె''లో జయసుధ, శోభన్‌బాబు ★★★



''ఈకాలపు ఎల్లలు''లో రామకృష్ణ, ప్రభ

## సినిమా

### జయచిత్ర చిన్ననాటి సంఘటన !

సోగ్గాడు'' చిత్రం 19 కేంద్రాలలో నూరు రోజలు ప్రదర్శింపబడిన తరుణాన, ఆ చిత్రం తాలుకు శతదినోత్సవం విజయవాడ మునిసిపల్ స్టేడియంలో వైభవంగా జరిగింది

శతదినోత్సవ సభలో పాల్గొన్న వారిలో ఆ చిత్ర నాయిక జయచిత్ర వున్నారు మొదటి చిత్రమే ఆమెకు హిట్ చిత్రం అయినందుకు ఎంతో ఆనందించింది నిర్మాత రామానాయుడుగారికి, ఆదరించిన ప్రేక్షకులకు కృతజ్ఞతలు తెలుపుకుంటూ, తన చిన్ననాటి సంఘటనలను పాఠకులకు వివరించమని అడిగింది

''అలాగే'' లన్నాను

''ఆమెకు ఎనిమిదేండ్ల వయస్సు లయిస్‌క్రీమ్ అంటే చాలా యిష్టం రోజూ నాల్గయిదుసార్లు అమ్మకు తెలీకుండా అయిస్‌క్రీమ్ తినేది ఒకరోజు అమ్మాజీ తన కుమార్తె లలవాటును పసిగట్టింది అయిస్‌క్రీమ్ కొనబోతుంటే, గబ గబ వచ్చి ఆపు చేసింది జయచిత్ర వూరుకుండా కిందపడి ఏడవడం మొదలెట్టింది ఎంత చెప్పినా వినకపోయేసరికి, జయచిత్రకు బెత్తం దెబ్బలు తప్పిందికాదు అప్పట్నుంచి అయిస్ అంటే అలర్జీ ''

### వంటగదికి పరారీ !

''ఒక రోజున వొళ్ళు కాలుతూవుంది తల నొప్పి తీవ్రంగా వుంది డాక్టర్ వచ్చాడు సూది అయారుచేశాడు తీరా యింజెక్షన్ యివ్వబోతుంటే, లాగి అవతల పారేసింది నాకు ఇంజక్షన్‌వద్దు, డాక్టర్ అంటూ వంటింటికి పరుగెత్తింది అప్పట్నుంచీ యిప్పటివరకు జయచిత్రకు యింజెక్షన్ వాసన తెలీదు ''

మరొక రోజున అందరూ సినిమాకు వెళ్లారు లోపల గడియ వేసుకుని నిద్ర ప్రారంభించింది సినిమాకు వెళ్లినవాళ్ళు తిరిగొచ్చి తలుపు బాదడం కూడా ఎరపడనంత నిద్ర లన్నమాట కుంభకర్ణుడి నిద్ర ఎంతో బిగ్గరగా పిలిచి చూచారు అరచి చూచారు కానీ జయచిత్రకు వినిపిస్తేగా అవతలివాళ్లు తలుపు పగలగొట్టి లోపలికి రాకతప్పింది కాదు ఆ రోజునుంచి యింట్లో ఒంటరిగా వుండడానికి భయపడుతుంది.

### పైపులో పాము

స్నానాల గదిలోకి వెళ్లిన జయచిత్రకు పైపులో ఏదో నృత్యం చేస్తున్నట్టు కనిపించింది పుల్లతో లటు యిటుగా ఆడించింది ముందు తోక కనిపించేసరికి బల్లి కామోసు అనుకుంది నిర్లక్ష్యంగా అటు జరిగేసరికి, రెండడుగుల పాము బుసకొడుతూ బయట కొచ్చింది జయచిత్రకు ముచ్చెమటలు పోశాయి నాగరాజా నన్ను కాపాడు నీ పుట్టలో పాలు పోస్తాను లని దండం పెట్టుకుంది ''

### పల్టీకొట్టిన కారు !

''కడవుల్ మామా'' తమిళచిత్రం షూటింగునుంచి తిరిగివస్తుంటే, విలిపురం దగ్గర ఒక భయంకర ప్రమాదం క్షణంలో తప్పినట్టు జయచిత్ర చెప్పింది పెద్దగుంటలో కారు మూడుసార్లు పల్టీ కొట్టి గట్టు చేరిన సంఘటన తలచినప్పుడల్లా, ఒళ్లు జలదరిస్తుంది'', అని నిట్టూర్చింది

— శ్రీనివాస్



''భక్త కన్నప్ప''లో సారధి, రావు గోపాలరావు

## రచయితలకు విజ్ఞప్తి

★ ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురణకు పరిశీలనార్థం మా కార్యాలయానికి చాలా ఎక్కువ సంఖ్యలో రచనలు, బొమ్మలు వస్తూంటాయి నిబంధనలు పాటించి రచయితలు మాతో సహకరిస్తే తప్ప — ఆయా రచనల వైనం వారికి తెలియజేయడం సాధ్యం కాదని మేము పదే పదే విజ్ఞప్తి చేయటానికి కారణంకూడా అదే

మా కార్యాలయానికి స్వయంగా వచ్చి రచనలు, కార్టూన్‌లు అందజేసేవారుకూడా పరిశీలనానంతరం వాటి వైనం తెలుసుకునేటందుకు తమ రచనలతో పాటు స్వంత చిరునామాగల స్టాంపు అతికించిన కవరు వుంచడం అవసరం రచనపై అంగీకారం కాని, అనంగీకారంకాని ఆయా రచయితలకు తెలుపటానికి కనీసం ఆరు వారాలు పట్టవచ్చును అది కూడా పోస్టు ద్వారా తెలియజేయడమే సాధ్యం —సం

''విశ్వంగారూ! మిమ్మల్ని అన్యధా భావించు కున్నాను మా అక్కయ్యను చెడుగా ఊహించు కున్నాను నిజానికి ఇంత కాలం నేను మనిషినే కానేమో.'' ఇంకా పశ్చాత్తాపపడుతూనే ఉందిసుమ

''ఇంత కాలం మాట వదిలెయ్ సుమా ఇపుడు నువ్వు మనిషివి ప్రకృతిలో వింతలూ విడ్డూరాలూ ఏర్పడాలంటే భూమి కంపించాలి లేదా అగ్నిపర్వతాలు బ్రద్దలు కావాలి అలాగే మనిషిలో మార్పు రావాలంటే ఏదో సంఘటన జరగాలి ఏవో నిజా నిజాలు బయట పడాలి ఏది జరిగినా అనుకోకుండానే — కావాలనుకున్నప్పుడు ఇలాంటివి సంభవించవు మీ అక్కా చెల్లెళ్ళను — ఇలా చూస్తుంటే నిజంగా నా కనుల పండువుగానే ఉంది '' అన్నాడు విశ్వం తన్మయత్వంగా

తర్వాత సుమ స్థిమితంగా అంది

''విశ్వంగారూ! ఇంతకుముందు ఈ గదిలో మీరు మాట్లాడుకున్న ప్రతి మాటనూ విన్నాను అక్కయ్య మాటలను వేరేగా అర్థం చేసుకోకండి దాన్ని మీరు తప్పక చేసుకుతీరాలి ''

చెల్లెలే అలా అంటున్నప్పుడు ఇక సుజాత ఏం మాట్లాడుతుంది?

''ఎప్పుడూ నాది ఒకటే మాట సుమా నువ్వేమయినా చెప్పదలుచుకొంటే మీ అక్కయ్యకు చెప్పు అంతేకాని నాకు కాదు'' అన్నాడు విశ్వం నవ్వుముఖంతో

సుజాత సిగ్గుగా తల వంచుకొంది

''మీరేమో అనుకుంటున్నారు కానీ, మా అక్కయ్యదీ ఒకటే మాట'' — సుమ ముఖంలోనూ చిరునవ్వు తొంగిచూసింది

అంతటితో అక్కడి వాతావరణంలో ఆనందమే వెల్లివిరిసింది

## 20

**సుందరి హాస్పిటల్లో రెండు రోజులే ఉంది మూడవనాడు డిస్చార్జి అయి తిరిగి ఇంటికి వచ్చే సింది ఆమెకు ఇంకా విశ్రాంతి అవసరం అని చెప్పాడు డాక్టరు అలాగే ఏర్పాట్లు చేశాడు సుబ్బరామయ్య**

ఇంట్లో సుజాత, సుమ ఇపుడు ఎంతో అన్యోన్యంగా ఉంటున్నారు అది చూసి 'అక్క అంటే ఎప్పుడూ నిప్పుమీద ఉప్పులా చిటపటలాడే సుమ ఆకస్మాత్తుగా మారిపోవటం అనూహ్య పరిణా మంగా తోచింది ఆ తండ్రికి 'ఈ మార్పు ఎలా సంభవించిందా?' అని మనసులో ప్రశ్న ఒక ప్రక్క మొలుగుతున్నా, 'వాళ్ళిద్దరూ కలిసి మెలిసి ఉండటం కంటే తనకు కావలసిందేముంది?' అన్న ఆనం దంతో అతడి హృదయం మరో ప్రక్క ప్రఫుల్ల మవుతూనే ఉంది

ఆ రోజే — సుందరి హాస్పిటల్ నుంచి ఇంటికి వచ్చిననాడే — మరొకటి జరిగింది —

పెళ్లికి ముహూర్తం నిశ్చయం అయింది మొదలు ఒకసారి తన ఊరు వెళ్ళిరావాలని ఎప్పటి కప్పుడు అనుకొంటూనే ఉన్నాడు విశ్వం అయితే వేరే ఊహలకు పోయి సుబ్బరామయ్యను అడగటానికి తాత్సారం చేశాడు, అతడు.

సీరియల్

# కాలమిచ్చిన తీర్పు

'అన్నపూర్ణ'

*(గత సంచిక తరువాయి)*

ముహూర్తం దగ్గరపడింది ఇటువంటి సమ యంలో తను తన ఊరు వెళ్తానంటే నమ్ముతారో లేదో? తన మనసులో ఏ కల్మషం లేకపోయినా లోపల ఏవో దురూహలు పెట్టుకొని నటిస్తున్నాడని అపోహ చెందుతారేమో? 'సమయానికి తప్పించు కొనేందుకే తను వెళ్తున్నాడు ఎన్ని ఆదర్శాలు వల్లెవేసినా పైకి ఈ కురూపిని చేసుకోవటానికి అంతరాత్మ ఒప్పుకోవద్దూ? నా బ్రతుకింతే' అని సుజాత విరక్తి చెందొచ్చు

కానీ జీవితంలో అతి ముఖ్య ఘట్టాలలో పెళ్లిది ప్రథమ స్థానం మళ్లీ మళ్లీ కావాలను కొంటే జరగదు ఆ వేడుక — సంతోషాలు మరో జన్మ ఎత్తితేనే ఇక సంఘం దృష్టిలో తనకు ఎవరూ లేకపోవచ్చు తన దృష్టిలో మాత్రం తనకు అంతా ఉన్నారు

కడుపు మాడి చావకుండా పట్టెడు అన్నం పెట్టినవాళ్ళు, మానభంగం చెందకుండా చింకి బట్టలిచ్చినవాళ్ళు, చదువాగిపోకుండా పాత పుస్తకా లిచ్చినవాళ్ళు, పరీక్షలాగిపోకుండా ఫీజులు కట్టిన

**జరిగిన కథ 6** సుబ్బరామయ్య సుందరిల సంతానం సుజాత, సుమ, సుధాకర్‌లు సుజాత అనాకారితనాన్ని ఏవగించుకునే సుమ, మెడిసన్ చదవాలని పట్టుబట్టే సుధాకర్‌ల వల్ల కంత చెందుతాడు సుబ్బరామయ్య తన అల్లుడికి ఉద్యోగం ఇప్పించమని బాల్యమిత్రుడు రామనాధం సుబ్బరామయ్యని కోర్తాడు సుబ్బ రామయ్య చెల్లెలు సీత కొడుకు రమేష్ దుర్వ్యసనాల పాలవుతాడు రమేష్ వ్యాపారానికి కావలసిన అప్పిప్పించటానికి అంగీకరిస్తాడు సుబ్బరామయ్య ఆ యింట్లో రామనాధంచే వదలబడ్డ అనాధ విశ్వం, తన మాట నేర్పుతో అందరికి చేరువ అవుతాడు అందాలరాశి సుమను వలలో వేసుకోడానికే విశ్వం నాటక మాడుతున్నాడని సుధాకర్‌కు నూరిపోస్తాడు రమేష్ విశ్వాన్ని శంకిస్తారు సుందరి, సుబ్బ రామయ్యలు సుజాతను విశ్వంతో సినిమాకు పంపురాడు సుబ్బరామయ్య రమేష్‌తో తిరుగు తున్న సుధ కూడా చెడిపోకుండా చూడమని విశ్వాన్ని కోరుతుంది సీతమ్మ విశ్వం తన ప్రేమను తిరస్కరించాడన్న కసితో రమేష్‌తో తిరుగుతూంటుంది సుమ సుజాతనే చేసు కుంటానని విశ్వం రూఢిగా చెప్పగానే రామ నాధన్ని పిలిపించి ముహూర్తం పెట్టిస్తాడు సుబ్బరామయ్య రమేష్‌వల్ల శీలభంగం కాకుండా తండ్రిచే కాపాడబడిన సుమ, సుజా తను క్షమాపణ కోర్తుంది

వాళ్ళు చాలామంది ఉదారులున్నారు తన ఊళ్ళో అసలు ఆ ఊరంతా తనవాళ్ళే అటువంటివాళ్ళకు ఈ పెళ్లిని గురించి తను వెళ్లి తెలియచెప్పకపోవటం నేరమే అవుతుంది విషయం తెలిశాక అంతా తన పెళ్లికి రావటం, రాకపోవటం కాదు సమస్య — ముఖ్యంగా వార్త తెలిసి అందరూ సంతోషిస్తారు ఈపాటి కృతజ్ఞతకు పొంగిపోయి మనసారా దీవిస్తారు అవే పది వేలు తనకు

ఏదేమైనా సరే తనిక ఉపేక్షించి లాభం లేదు అయినా, మనసులో ఎలాంటి దురుద్దేశ్యం లేనప్పుడు తను భయపడటం అనవసరం ఇప్పటి వరకు తనమీద నమ్మకం లేకపోతే ఒకవేళ — ఇక ముందయినా ఆ నమ్మకం కలిగేట్లు చూసుకోవచ్చు

— ఆ గుండె ధైర్యంతోనే సుబ్బరామయ్య దగ్గరికి వెళ్లి తన మనసులో మాటను బయట పెట్టేశాడు

''అలాగే వెళ్లిరా విశ్వం! అయినా ఈ మాత్రం దానికి నన్ను అడగాలటయ్యా?'' అన్నాడతడు ఎలాంటి సందేహాలకు చోటివ్వకుండా

సుబ్బరామయ్య దృష్టిలో విశ్వం మహోన్న తుడు కాబట్టే సుజాతను చేసుకోవటానికి అంగీక రించి — తనకు యావన్మాత్రపు మనశ్శాంతిని ప్రసా దించగలిగాడు ముహూర్తంకూడా నిర్ణయం కావటంతో అతడిమీద అపారమైన గౌరవం ఏర్పడింది

''సరే సర్'' ఇవతలకు వచ్చెయ్యబోయాడు ఈలోపల మళ్లీ సుబ్బరామయ్య వెనక్కి పిలిచాడు అతణ్ణి

''ఇదిగో విశ్వం! నువ్వు త్వరగా వచ్చెయ్ వచ్చేటప్పుడు రామనాధాన్ని కూడా తీసుకురా వాడొక్కడుకాదు — వాళ్ల కుటుంబం మొత్తాన్ని వెడ్డింగ్ కార్డు ముందే పంపాలే'' అని చెప్పాడు

విశ్వం ఆ మధ్యాహ్నమే బయలుదేరి వెళ్లాడు

''నాన్నగారూ! నాన్నగారూ!'' అంటూ హడావిడిగా పరుగెత్తుకు వచ్చాడు సుధ, ఆ సాయంత్రం తన గదిలో కూర్చొని ఆఫీసు కాగితాలు చూస్తున్న సుబ్బరామయ్య దగ్గరికి

''ఏమైందిరా?'' — తనూ ఖంగారుగానే అడిగాడు కొడుకును

''రమేష్ బావ బుక్‌షాప్‌కు ఫైర్ యాక్సి డెంట్ ''

ఒక్కసారిగా కూర్చున్న కుర్చీలోంచి లేచి పోయాడు సుబ్బరామయ్య

''ఎప్పుడు? ఎలా జరిగిందిరా?''

సుబ్బరామయ్య ఆందోళనకు అర్థం ఉంది రమేష్‌కు బ్యాంకిలోను ఇచ్చేటప్పుడు తను హామీ ఉన్నాడు ఇప్పుడు ఏదేటు పోయివచ్చినా — తన మీదేం వచ్చిపడుతుందో? – మనసులో దిగులు బయలుదేరింది

''ప్రమాదవశాత్తు అని కొందరంటున్నారు లేదు కావాలనే జరిపించారని కొందరు అంటు న్నారు రమేష్ బావను మాత్రం పోలీసులు కస్టడీ లోకి తీసుకున్నారట'' తనకు తెలిసినంతవరకు చెప్పేశాడు సుధ

అది విన్న తర్వాత సుబ్బరామయ్య కాలు క్రింద భూకంపం వచ్చినట్లు తయారైంది ముందు ఏమీ తోచలేదు

కాసీ, తర్వాత ఆలోచన వచ్చి - - త్వరత్వరగా వెళ్లి డ్రస్సు చేసుకొని చరచర బయటికి నడిచాడు తండ్రి తనతో రమ్మనలేదుకదా అని ఇంటిదగ్గరే ఆగిపోయాడు సుధాకర్

రిషామీద వెళ్లిన సుబ్బరామయ్యకు పైకప్పు పూర్తిగా కాలిపోయి, గోడలు బీటలుబారిన పాత కాలపు ఇల్లు కనిపించింది అది మంచి సెంటరులో ఉంది అద్దె తక్కువ బిజినెస్‌కు అనువుగా ఉంటుందని దాన్ని అతడే కుదిర్చాడు నష్టమంతా ఇంటివాళ్ళదే తను కనిపిస్తే వాళ్ళేమంటారో ?

తర్వాత రిషాను త్రి టౌన్ పోలీస్ స్టేషన్‌కు పోనివ్వమన్నాడు

రమేష్‌ను కలుసుకోవటానికి తొందరగానే అనుమతిచ్చాడు ఎస్ ఐ

''ఇది నాకు తెలియదు మామయ్యా యక్సిడెంటల్‌గా జరిగింది అంతే'' — అని తన మామయ్యకు చెప్పుకున్నాడు రమేష్

''నిన్నింకా నమ్మమంటావా రమేష్? డబ్బు కోసం కన్నతల్లి ప్రాణాలు తీయటానికి సిద్ధపడ్డవాడివి, నీ సంతోషం కోసం ఎదటివాళ్ళ జీవితం నాశనం చేయటానికి వెనుకాడనివాడివి — నిన్ను నమ్మమంటావా ?''

— అలా అడుగుతున్నప్పుడు సుబ్బరామయ్య కళ్ళముందు తల పగిలి తన ఇంటికి ఏడుస్తూ వచ్చిన సీతమ్మ, తను వెళ్లటం కొన్ని నిమిషాలు ఆలస్యమైతే శీలం చెడగొట్టుకొనే సుమ — వాళ్ళిద్దరూ మెసిలారు అందుకే అతని నోటినుంచి అలా కరకుగా మాటలు వచ్చాయి



## కాలమిచ్చిన తీర్పు

''గతంలో నేను చేసినవి తప్పులే ఒప్పుకుంటాను కానీ, ఈ ధైర్యం నేను చేయలేదు'' దుఃఖభరితమైంది రమేష్ స్వరం

అతడి ముఖం చూశాక కొంత జాలనిపించింది సుబ్బరామయ్యకు వాడి మాటలు నిజమేనేమో ? ఈ సంఘటన ప్రమాదవశాత్తూ జరిగిందేమో ? అలా జరిగితే ముందు రమేష్ మాటేమోకానీ తను కొంత తేరుకుంటాడు ఆ తొందరలోనే రమేష్‌తో మరింకేమీ మాట్లాడకుండా ఎస్ ఐ దగ్గరకువచ్చాడు

సబిన్స్‌పెక్టర్ సుబ్బరామయ్యకు తెలిసినవాడే అందుకే ఉన్న విషయం ఏమిటో చెప్పాడతడు

''ఇది యాక్సిడెంటల్‌గా జరిగిందనటానికి వీల్లేదు సుబ్బరామయ్యగారూ ! కరెంట్ షార్టేజీ వల్ల ఆ అగ్నిప్రమాదం జరిగిందని ముందు అనుకున్నా షాపు లోపలి భాగంలో చిత్తుకాగితాలు కుప్పలుగా పోసిఉన్నయ్ ఆ కాగితాల మీద పెట్రోలులాంటిది ఏదో పోసి కావాలనే ఎవరో నిప్పు పెట్టారు ఆ మంటలు పైకి లేచి ఇల్లు అంటుకొంది దర్యాప్తు చేశాక ఇది మాకు రూఢి అయింది చూసినవాళ్ళు కూడా ఆ షాపు నొంచి గుప్పున ఒకేసారి మంట లేచిందని సాక్ష్యం చెబుతున్నారు రమేష్ కూడా అనుమానాస్పద పరిస్థితుల్లో అక్కడికి దగ్గరలోనే దొరికాడు ఊళ్ళో ఉండికూడా శలవు రోజు కానప్పుడుకూడా షాపు మూసి ఉంచటం, తన షాపు తగలబడిపోతోందని తెలిసీ అతడు ఆ ప్రాంతానికి రాకపోవటం — ఇంతకుమించి మరేం ఆధారాలు దొరకాలి ? ఇదంతా మీ మేనల్లుడే కావాలని జరిపించాడండీ అంతే''

ఎస్ ఐ చెప్పింది విన్నాక ఇందాక రమేష్ దుఃఖస్వరం గుర్తు వచ్చిన సుబ్బరామయ్యకు పట్టరాని కోపం వచ్చిందతడిపై 'నిజంగా వాడెంతటి నటకుడు!' అనుకొని నిస్సారంగా లేచి — అక్కణ్ణుంచీ తిరిగి రిషాలో ఇంటికి వచ్చాడు

లోపల అడుగుపెట్టిన అతడికి హాలులో ఏడుస్తూ కూర్చున్న సీతమ్మ, ఆమెను ఓదారుస్తూ ప్రక్కనే కూర్చున్న సుందరి కనిపించారు అక్కడే సుధ కూడా ఉన్నాడు

ఇంట్లోకి వచ్చిన తన అన్నయ్యను చూశాక సీతమ్మ దుఃఖం మరింత ఎక్కువైంది

''అన్నయ్యా!'' అంటూ బావురుమంటూ సుబ్బరామయ్య దగ్గరికి వచ్చింది

చెల్లెలి దైన్యస్థితిని తలుచుకున్న అతడికీ కన్నీళ్ళు ఆగలేదు 'ఒక్కగానొక్క బిడ్డ అని — ఎన్నో ఆశలు పెట్టుకొంది రమేష్‌మీద కానీ వాడు తన తల్లికి ఇస్తున్న బహుమానం — మనస్తాపమేగా ?' అని తనూ బాధ పడ్డాడు

''వాడిక బాగుపడడన్నయ్యా—బాగుపడడు'' వెల్లువలా వస్తోంది సీతమ్మకు దుఃఖం

''మనం అనుకుంటామే కానీ, ఎవరికి ఎవరం బాధ్యులం, సీతా! రమేష్ బుద్ధిపూర్వకంగా చేసే దానికి నువ్వుమాత్రం ఏం చేయగలవ్ ?'' అంటూ తనకు తోచిన మాటలతో ఓదార్చాలని చూశాడు

''నిజమే అన్నయ్యా'' — ఒక నిర్ధారణకు వచ్చి

నట్లు సీత కళ్ళు తుడుచుకొంది మళ్లీ అంతలోనే ఏవో తలపుకు వచ్చి కళ్ళనీళ్ళు పెట్టుకొంది

"వాడివల్ల నీ కిప్పుడు ఎంతో అప్రదిష్ట వచ్చిందన్నయ్యా పైగా వాడి బుద్ధి తెలిసీ నిన్ను సహాయపడమన్నాను"

"కన్నతల్లిగా నీ ధర్మం నీవు నిర్వర్తించావు సీతా అంతే"

— చెల్లెలితో మాట్లాడుతున్నాడే కానీ పైకి—అతడి అంతరాత్మలో పరి పరి విధాల ఆలోచనలు ఇది రమేష్ కావాలనే చేశాడని కోర్టులో కూడా రుజువైతే మధ్యవర్తిగా ఉన్నందుకు తను కట్టవలసి వస్తుంది బ్యాంకువాళ్ళకు డబ్బు కాస్త కూస్త కాదు — వేల సంఖ్యలో! తను డబ్బు కలవాడైతే సుధ మనసు పడ్డట్లు వాణ్ణి మెడిసిన్ చదివించలేక పోయేవాడా? ఒకవేళ తను అంత డబ్బు బ్యాంకువాళ్లకు కట్టవలసివస్తే ఏమిటి చెయ్యటం? గుండెలో బండ పడ్డట్లయితోంది సుబ్బరామయ్యకు

"కాదన్నయ్యా, నిన్ను వంచించాను కానీ, నీవు నన్ను గురించి అన్యాయమైపోకూడదు"

"ఏమిటి సీతా యీ మాటలు?"

"నాకు తెలుసు నన్నయ్యా! రమేష్‌కు బ్యాంకువాళ్ళు డబ్బిచ్చేటప్పుడు నీవు హామీ వున్నావ్ ఆ డబ్బు నువ్విప్పుడు తిరిగి చెల్లించాలి"

సుబ్బరామయ్య తల పట్టుకొని అక్కడే ఓ కుర్చీలో కూలబడిపోయాడు

ఇంతవరకు 'ఆ డబ్బు — బ్యాంకు విషయం' తన మనసులోనే వుండిపోయింది ఆ మాట సీతకు చెప్పటం యెట్లా? ఒకవేళ చెప్పినా ఆమె దగ్గర డబ్బేది? దానికున్న సర్వ ఆస్తీ ఆ ఇల్లు ఒక్కటే ఆ యింటిమీద వచ్చే అద్దె దాని జీవనాధారం అది డబ్బు తెచ్చివ్వాలంటే యింటిని అమ్మెయ్యాలి ఇల్లు అమ్మేశాక — అదేమవుతుంది? యిలా లోలోపల మథనపడుతున్నాడు చివరకు సీతమ్మే ఆ సంగతి యెత్తింది

'ఏదెలా జరిగితే అలా జరుగుతుంది అయినా డబ్బు సమస్య ఇలాంటివి యెంత దాచినా—ఎప్పుడో ఒకప్పుడు లేమివల్ల వాటంతట అవే బయటపడి పోతాయి' అని దృఢంగా అనుకున్నాకే సీతమ్మకు అన్ని విషయాలు వివరించాడు

"దీన్ని గురించి నువ్వేం దిగులుపడకు అన్నయ్యా! అవసరమైతే ఇల్లు తాకట్టుపెడతాను లక్షరూపాయల కిమ్మత్తుచేసే యింటిమీద పదివేలు అప్పుగా దొరక్కపోతుందా?" అంటూ డబ్బు విషయంలో తన అన్నయ్యకు పూర్తి భరోసా యిచ్చింది సీతమ్మ

చెల్లెలి మాటలు విన్నాక కొంతవరకు గుండె నిబ్బరం ఏర్పడింది సుబ్బరామయ్యకు

చివరకు —

"రమేష్‌కు మాత్రం శిక్షపడక తప్పదమ్మా" అంటూ లేచాడు

"పడనీ అన్నయ్యా! వాడు చేసుకున్నది వాడే అనుభవిస్తాడు కొంతకాలంపాటు ఆ జైల్లోనైనా వుంటే వాడి బుద్ధిలో ఏమైనా మార్పు వస్తుందేమో" అని ఊరుకొంది

సుందరి వాళ్ల మాటల్లో కలిగించుకోలేదు కానీ, అక్కడేవున్న సుధను చూశాక సుబ్బరామయ్య మనసు చేరేగా పోయింది 'రమేష్‌తో స్నేహంగా వుంటున్నాడు తమ్ముడు' అని ఒకసారి సుజాత తనకు ర్యాదు చేసింది కానీ, దాని మాటను అప్పుడు సీరియస్‌గా తీసుకోలేదు తను అనుకున్నది కాకపోవటంవల్ల అసలే మనసు చెదరి వున్నాడు ప్రతి చిన్న విషయంలోనూ తను కలుగ జేసుకోనటంతో - విరక్తిచెంది ఏమైపోతాడో వాడు? అనే సంశయించాడు అయితే రమేష్‌తో స్నేహం పాముతో చెలగాటంలాంటిదని యిప్పుడు తెలిసిపోయింది మరి ఆ సంఘటనలో సుధకు ఎలాంటి సంబంధం లేదుకదా?

అనుమానంగా తోచి ఏదో అవసరమైన పనున్నట్లు కొడుకును తన గదిలోకి పిలిచి అడిగాడు

"నిజంగా చెప్పు నీకేం సంబంధంలేదా యిందులో?"

"ప్రమాణపూర్తిగా నాన్నగారూ! నాకేం తెలియదు"

"నీమీద కేమైనా వస్తుందనికానీ, నిన్ను నేనేమైనా అంటాననికానీ భయపడకు"

"లేదు నాన్నగారూ!"

ఇందులో సుధకు ఏం సంబంధంలేదని నిర్ధారణ అయిపోయింది కాని, మళ్లీ సంశయం — రమేష్‌తో స్నేహంచేశాడు వాడితో స్నేహంచేసివీడూ నటించు నేర్చుకున్నాడేమో? అందుకే అడిగాడు

"వాడితో నీకు స్నేహమటగా?"

"లోగడ కొన్నిరోజులు బావతో తిరిగినమాట నిజమే కానీ, ఇప్పుడసలు అతడి దగ్గరికి వెళ్లటం లేదు బావ అత్తయ్యను ఎప్పుడు కొట్టాడో అప్పుడే నా మనసు మారిపోయింది నాన్నగారూ!"

కొడుకు అంత అమాయకంగా, నమ్మకంగా చెబుతున్నాక—అతడి మాటల్ని విశ్వసించక తప్పలేదు సుబ్బరామయ్యకు ఇక వాణ్ణి వత్తిడిపెట్టటం తెగిందాకా బిగించినట్లే అవుతుందని ఊరుకున్నాడు పైగా తన హెచ్చరింపు, మందలింపు లేకుండానే తన కొడుకు వాడికి వాడే తన మనసు మార్చు కున్నందుకు లోలోపల సంతోషించాడు

ఇపుడు సుబ్బరామయ్య మనసునిండా కావలసినంత సంతృప్తి

చిక్కుసమస్య అనుకున్న పెద్దకూతురి పెళ్లి — మామూలుగానే జరిగిపోతోంది పెంకెఘటం అనుకున్న చిన్నకూతురిలో సరళ స్వభావం ఏర్పడింది సుధను గురించి దిగులుపడవలసిన పని లేదు ఏమవుతుందో అనుకున్న సుందరి ఆరోగ్యం తొందరగానే కుదుటపడింది యిక మిగిలిన పెళ్లి యేర్పాట్లు చురుకుగా జరిగేట్లు చూడాలి

ఇప్పటికే కొన్ని కొన్ని పనులు జరిగిపోయాయి శుభలేఖలు అచ్చువేయించి అందరికీ పంపించి వేశాడు కొత్తబట్టలు ఖరీదు చేశాడు కొన్ని కొన్ని నిలవ పచ్చళ్ళు చెల్లెలు సీతమ్మచేత పెట్టించాడు పెళ్లి కళ్యాణమంటపంలో చేయటానికి నిశ్చయించి - కొంత డబ్బు కట్టి మంటపాన్ని ఆ వేళ్టికి తనకు రిజర్వు చేయించాడు

తనవైపు బంధువర్గం ఎక్కువవుంది లేరు విశ్వం తరఫున రామనాథం కుటుంబం, ఇంకా వస్తే అతడి స్నేహితులు, పరిచయస్తులు పదిమంది—కాకపోతే వందమంది వచ్చినా ఫరవాలేదు

ఏదేమైనా వృద్ధాంతలో తన ఇంట్లో జరుగుతున్న ఈ మొదటి శుభకార్యాన్ని ఘనంగానే జరిపించాలని సంకల్పించుకున్నాడు అతడు

(ఇంకా వుంది)

## గురు - లఘువులు

ఆచార్యత్వానికి
అంజలి ఘటించి
అ ఆ లు, దిద్దు వేళ
అక్షరాలు, నాదు చిన్ననాట, నేర్చువేళ
ఆచార్యుని
పెద్దగా భావించి
పెద్దలంపెడివారు, మాతోటి
పెరటితోట పంటలన్నీ!
పండుగైనా
పబ్బమైనా
స్వయంపాకపు
సరంజామా
సంచులంపెడివారు
గురువే దైవమని
శిష్యుడే సంతతియని, తలచి
గురు, శిష్యుల, బంధమే
అనుబంధమై
అలరెడెదానాడల!
కాని ఈనాడు
గురువుకు, శిష్యుడు లేడు
శిష్యుడుకు, గురువు లేడు
శిష్యున కనుమానం
గురువుకు సందేహం
గురు శిష్యుల బంధం
గుడు, గుడు, కుంచమైంది
గులకరాళ్ల సంబంధమైంది
చెప్పేవాడూ లేడ
చెపితే వినేవాడూ లేడు
చెవిలోకి అక్షరాలు దూరుతాయనేమో
జుట్టును,
జలపాలుగా మార్చి
పారా హుషార్
చేయిస్తున్నారు
"చేవ" ఉన్నవాళ్లంతా
ఇష్టమున్నా, లేకున్నా
బయటనైన్నా
దండాలెడుతున్నారు, అప్పుడపుడూ
దండలుకూడా వేస్తున్నారు
అరదండాలు వేయించటంలేదు కొంత నయం
అదేమంటే
ఆ కాలంలో లేరా
శిష్యుని బొటనవ్రేలిని కోరిన
ఆచార్యులు అన్నాడొక
విజ్ఞానపు తేజం
అజ్ఞానపు తిమిరం

— ఈడుపుగంటి లక్ష్మణరావు

## సామాన్యుని సణుగుడు

### హీరో వర్‌షిప్-1

ఆంధ్రప్రదేశ్‌లో సినిమా
వాళ్లకి మాత్రం ఇప్పటికీ
మూడు విచిత్ర భాగాలున్నాయి
నైజాం — సీడెడ్ — అండ్
ఆంధ్రా ప్రాంతాలని అంటారు
వాల్‌పోస్టర్ల మీదా
వెండితెర మీదా వాళ్లు
ఇంకా తెలంగాణాని
నైజామని రాయల
సీమను దత్తమండలమనీ
ఎందుకంటీ అనడం ?
కోస్తా తెలంగాణా
రాయలసీమ అంటూ
రిఫర్ చేస్తే వీటిని
బిజినెస్ కేమైనా ?
దెబ్బా ? ని సందేహం
సామాన్యునికి
వస్తూంటుం దప్పుడప్పుడు
మొత్తంమీదివాళ
ఈ ముప్పేటాంధ్రావనిలో
బోల్డుమాస్ అప్పీల్‌తో
"హిట్లు"కు హిట్ అయిపోయి
పోకుండా వున్న బైస్కోప్
ఏదయ్యా ? అంటే
వెంటనే 'షోలే' 'షోలే'
అని టక్కున చెపుతాడు
మినీయింటర్వ్యూ కుర్రాడైనా
అతని చిన్న తమ్ముడైనా

* * *

ఏం మాయదారి "షోలే"వో
నిజంగా "జ్వాలే" అయి
చుట్టుకుంది తెనుగు
ప్రేక్షక జనాన్ని అన్నాడో
రంగు బొమ్మల నిర్మాతీ ఏధ్య
—మరి పరిగెట్టదా ?
డబుల్ సెంచురీకీ జ్వాల
అందులో డైలాగుంది పొట్టిగా
"డ్రామా" వుంది లోతుగా
ఆపైన సెక్సుంది –
సెక్సుమీద రొమాన్సుముక్క
మీద రాసిన వెన్నలాగ
సాడిస్టిక్ స్టంటుంది
మరిగంటే రెండు హీరోలు
వాళ్లమధ్య ఒక
"భరత్"డు మరో "గబ్బర్"
సింగుడు — అంతటితో
ఆగక హేమామాలినీ అండ్
ఆర్‌డిబర్మన్‌ల
కరామత్ భీహై!
ఏతేనేం "ట్రాష్" — అది
క్రిటిక్‌ల కిట్టవి కళ్లకి
షోలే షోలేయే మన
వాళ్ల కంటికి ఎర్రగా
రెడీమేడ్ సెట్టింగుల
హంగుల రంగుల కదగా
వెండితెర వింతగా భా(?)సిస్తున్నది
కాని మన తెరమీద
అంతా 'హీరో' వర్‌షిప్
తప్ప టైటిల్ డిస్ప్లేలో
షోలే లుండవు షబ్బాష్
లుండవు ఉండవుకదా
దీవార్ దీదార్ హంగామాలు!
మనవాళ్లంతా దేవుళ్లు
దేవుళ్లను మించి మనుషులు!
'మొనగాడు' — మొనగాడికి
మొనగాడు ఆ మొన
గాడికి మొగుడు —
మొగుళ్లకి మగాడు
మగాడికి మగాడు
సోగ్గాడు సోగ్గాళ్లకి
సోగ్గాడు రాముడు
రాముళ్లకి రాముడు
భీముడు భీముళ్లలో
భీభీముడు — ఇదో సీరిస్
మంచివాడు మంచి
మంచివాళ్లలో మంచివాడు
మహాత్ముడు మహా
పురుషుడు మహా మహా
మహాత్ముడు మరో
మహాత్ముడు — యిలా మరో
సీరిస్ ఇదిగాక
మరో భలే సీరీసుంది
భలేవీరుడు భలే
వీరాధివీరుడు, భలే
భలేరాజు రాజులకు
రాజు రంగేలీరాజు
దాంతర్వాత నేనే
రాజును నేనే మగాణ్ని
నేనే నేనే నేనే హీరో
నంటూ యింకో హీరో సీరీసు!

[ వీరాజీ ] ★

## డాక్టర్ సలహాలు

— డా॥ కె వెంకటేశ్వరరావు

సి హెచ్ వై — పైడిపిల్లి

కీళ్ళవాయువు రావటానికి గల కారణమేమిటి ? దానిని నిర్మూలించుటకు ఏమి చేయవలెను ?

★ కీళ్ళ వాపులు (వాయువు) చాలా కారణాల వల్ల రాగలవని, ఇదివరకే వ్రాసినట్లుగాను, పైగా ఈ కీళ్ల రోగాలను గురించి 5, 6 వారాలపాటుగా ఆంధ్రపత్రిక — దిన సంచికలో వారం వారం — "డాక్టర్ కబుర్లు" అనే శీర్షికలో తెలియచేశాను తిరిగి అవన్నీ ఏకరువు పెట్టడం అనవసరమని నా అభిప్రాయం దాదాపు 3 సం లకు పైబడి ప్రతి వారం వెలువడుతూ ఉన్న ఈ డాక్టర్ కబుర్ల శీర్షికలో — వారాని కొకటి వంతున అన్ని రకాల (సామాన్యంగా రాగల) రోగాలనుగురించి, వ్రాయటం జరుగుతున్నదని, బహుశా మీలో ఎక్కువమంది పాఠకులకు తెలియదనుకుంటాను ఈ ఉత్తరం ప్రచురించటంలోని ముఖ్యోద్దేశం — చదువరుల దృష్టికి ఈ విషయాన్ని తీసుకురావటానికి మాత్రమే! పాత పత్రికలు తిరగవేసి సమాధానం దొరక్కపోతే మరలా వ్రాయండి

టి వి — సికింద్రాబాద్

మా అమ్మాయి ఏడవ ఏట, 4 నం ల క్రితం 'ఎపిలెప్సీ'కి గురి కావటము జరిగింది 'ఎపిలెప్సీ' అంటే ఏమిటి ? దాని కవసరమైన జాగ్రత్తలు తెల్పండి

★ "ఎపిలెప్సీ" అంటే మన ప్రాంతంలో "అపస్మారం" అనీ, "ఫిట్లు" అనీ, "మూర్ఛ రోగం" అనీ, అలా వివిధ రకాల పేర్లతో వర్ణించబడుతున్న రోగమే! ఈ రోగులకు, తరచు చేతులు, కాళ్లు తన్నుకోవటం, తెలివి (స్పృహ) తప్పటం, నోటినుండి నురుగు రవటం, ఈ స్థితిలో నుంచి నిద్రావస్థలోకి వారు జారుకోవటం, అలా తరచూ రావటంవల్ల — మెదడులో ఇదివరకు జరిగిన మార్పులు ఎక్కువ అయి, ఇంకా ఎక్కువగా ఈ "ఫిట్లు" రావటం జరుగుతుంది దీనికి కారణం — ప్రత్యేకంగా వేలెట్టి చూపించటం కష్టం

ఈ రోగం ఉన్నవారు, వైద్య పర్యవేక్షణలో, డైలాన్‌టిన్, ఫెనిటాయిన్ సోడియం మొదలైన మందులు, వారి సలహా ప్రకారం చెప్పిన మోతాదులో క్రమం తప్పకుండా వాడాలి

జి ఎన్ ఆర్ — ఖరగ్‌పూర్

నాకు 20 సం లు నాకు చిన్నతనములో కుడి వైపు కంటి నరము మీద దెబ్బ తగిలినది అప్పుడు మెల్ల వచ్చినది దీని విషయమై ఆపరేషన్ కూడా అయినది సుమారు 2 సం లు అయినది కాని కన్ను అదే విధముగా వున్నది తలనొప్పి కూడా ఎక్కువగా వున్నది తలనొప్పికి కళ్ళజోడు వాడుతున్నాను కాని కన్ను మాత్రము అలాగే వున్నది

★ ఏ ఆపరేషన్ చేసినా — అన్ని సమయాలలోను, అందరికీ తప్పకుండా యధాస్థితి ఏర్పడుతుందని ఆశించటం సమంజసమే అయినా నిజ జీవితంలో ఏదో కొన్ని రోగాలనిబట్టిగాని, చేసిన వారిని బట్టిగాని, ఆపరేషన్ అయిన తర్వాత వైద్యుల సలహా క్రమం తప్పక పాటించకపోయినాగాని, మీకు జరిగినట్లే కొందరికి జరుగటంలో ఆశ్చర్యంగాని, వ్యక్తుల అశ్రద్ధగాని కాదు "నూటికో, కోటికో" ఏదో ఒకటి విజయవంతం కానప్పుడు — శస్త్రచికిత్సా విధానాలనే రూపుమాపటం ఎంతవరకు సాధ్యం ? మీరు మళ్లీ అదే వైద్యుల వద్దకు వెళ్లి చూపించుకొంటే వారే తప్పక మీకు నయం చేయగలరు

వి జీ — కలకత్తా

నాకు 1 సం నుండి రెండు పెదిమల చివరలలో తెల్లగా వున్నది మల పరీక్షలో పురుగులు వున్నాయన్నారు వాటికి మందులు వాడాను కాని పెదిమల చివర తెలుపు పోలేదు మరో డాక్టరుకు చూపించి కొన్ని మందులు వాడాను ప్రయోజనము కన్పించలేదు

★ పెదిమలు తెల్లగా ఉన్నాయంటే "పాలిపోయి" ఉండటం అనే అనుకొని ఈ సమాధానం వ్రాయటం జరుగుతున్నది 'పొడలలాగా' లేక (శోభిలాగా) అయితే ఈ జవాబు వర్తించదు

మల పరీక్షలో క్రిములు ఉన్నాయని తెలిసిన తర్వాత, మందులు వాడి నయమవుతుందని ధీమాగా ఉండటం పొరపాటు తిరిగి మల పరీక్ష చేయించుకొని ఆ క్రిములు పోయినవో లేదో నిర్ధారణ చేసుకోవటం చాలా అవశ్యం "హూక్‌వర్మ్" వల్ల నెత్తురు లేమి ఏర్పడి (అనీమియా) చర్మం తెల్లగా పాలిపోయినట్లవుతుంది ఫెర్రస్‌సల్ఫేట్, కాప్సోవిట్ మొదలైన మాత్రలు రోజుకి 2 వంతున ఆహారానికి తర్వాత వేసుకోవటం మంచిది ●




# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

## బ్రిటానియా

# గ్లూకోజ్-డి



బ్రిటానియా గ్లూకోజ్–డి బిస్కట్లతో పాటు మరో ప్రముఖ బ్రాండ్ గ్లూకోజ్ బిస్కట్లను పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వలన తేలిందేమిటంటే: విటమిన్లు మరియు మొత్తం మీద పుష్టినిచ్చే పదార్థాలు గ్లూకోజ్–డిలో ఎక్కువగా ఉన్నాయని. అంతేగాక రుచికోసం, తియ్యదనం కోసం, కరకరలాడే తనానికి దీనిని కావాలంటారని. శక్తినిచ్చే విషయంలో, గ్లూకోజ్ కన్న గ్లూకోజ్ డి 20% ఎక్కువ శక్తినిస్తుంది!

బ్రిటానియా గ్లూకోజ్–డి–తియ్యటి రుచితో కూడిన శక్తి!




అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.

బ్రిటానియా బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్.B3C.GL-10-140TL




# మళ్ళీ మరోసారి మంచి లాభం!

చక్కని ఉతుకు
సుగంధపూరితమైన ఉతుకు

## గోద్రెజ్
బట్టల సబ్బు

CMGS 82 234 TL

# కను విప్పు

తన హాస్యానికి పగలబడి నవ్వుతాడు రఘు. ఆ సంతోషంలోనే వాణ్ణి పెళ్ళి సంబంధాలు చూడటానికొప్పిస్తుంది తను ముందుగా ఆ హైదరాబాదు సంబంధం చూడాలి అన్ని విధాలా బాగున్నట్లుంది పెళ్ళిళ్ళ పేరయ్య మాటలను బట్టి చూస్తే. ఎంతో బాగుం టుంది! ఆ లమ్మాయి కోడలుగావస్తే. ఏమైనా ఎవరైనా కోడలుగారనీ . తను కన్న కూతురిలా చూడాలి ఆమెను కట్టు కున్న భర్త కోసం కన్నవారిని తన వారంద రినీ వదులుకుని అత్తింట అడుగు పెట్టే కోడలును ... తను హృదయపూర్వకంగా ఆహ్వానించాలి తన వంశాభివృద్ధి కారకురా లయిన ఆమెను సాదరంగా ప్రేమగా చూడాలి అత్త అనే అభిజాత్యాన్ని .. అహంకారాన్ని ప్రదర్శించి ఆమె మనసు గాయపరచకూడదు ఆమె చేత కన్నీరు పెట్టించకూడదు కోడలు కన్నీరు ఇంటికి ఉసురు!

రాజమ్మ వచ్చి వరండాలో లైటువేసింది. చీకట్లను పారద్రోలి వెలుగు పరచుకొంది వరండాలో "అమ్మగారెదో ఆలోచనలో ఉండారు! పలకరిస్తే ఏం బాగుంటది?" అనుకున్న రాజమ్మ ఏదో పనికోసం వంటిం ట్లోకి వెళ్ళిపోయింది మళ్లీ.

అత్త అనే పదాన్ని పదిసార్లు తలుచు కోటంతో బయట అంత వెలుగు వెల్లి విరుస్తున్నా విశాలాక్షమ్మ మనసునిండా .. చీకట్లు ముసురుకున్నాయి అత్త అత్త . అత్త కసిగా ... కక్షగా పళ్ళు పటపట నూరింది ఆమె మనసు గతంలోకి దూరి . విహారం చేయసాగింది

* * *

"అమ్మాయ్ విశాలా!" గట్టిగా కేక పెట్టింది సరస్వతమ్మ. తల్లి కేకవిని హడా వుడిగా వంటింట్లో కొచ్చింది విశాల .. పరుగులాటి నడకతో ... "ఏమిటమ్మా?" అంటూ కన్నెవయసు ప్రసాదించిన యవ్వ నంతో అపురూప సౌందర్యం పోటీ పడు లోంది విశాలలో అసలుపేరు విశాలాక్షి అయినా . విశాలని పిలిపించుకోటమే బాగుం టుంది

"ఏమిటమ్మా ఏమిటే బంగారుతల్లీ! ఇవ్వా ళొక్కరోజు స్కూలుకు శెలవు చీటీ పంపించు – పక్కింటి పద్మజతో. వాళ్ళొస్తు న్నారు! నిన్ను చూసుకోటానికి మీ నాన్న గారెంతో హడావుడిచేసి ఇప్పుడే బజారెళ్ళారు ఇంట్లోకి కావలసినవి తెప్పించటానికి." కూతురువైపు ఆపేక్షగా చూసింది సరస్వ తమ్మ నా తల్లి అత్తింట్లో చక్కగా సుఖ పడుతుంది అని ఆకాంక్షించిందా తల్లిమనసు.

దానిక్కారణం లేకపోలేదు విశాల తండ్రి వెంకటామయ్యగారికి పదిహేనెకరాల సుక్షేత్ర మైన మాగాణీ ఉంది. బంగారం పండు తోంది పొలంలో. ఇంట్లో పుష్కలమైన పాడి ఉంది ఇవిగాక ఇంట్లో ఓ యాభై నవర్సుల బంగారముంది. బోలెడంతమంది నౌకర్లు చాకర్లు విశాల ... తల్లిదండ్రులకు ఏకైక సంతానం కావటంతో అల్లారు ముద్దుగా పెరుగుతోంది పుట్టింట్లో.




విశాల చదువుమీద పెద్ద ఆశలు లేవు అల్ల దండ్రులిరువురికి ఏదో చదువనూ రాయనూ వస్తే చాల్లెయ్యి! అంతకన్నా చదువుల్నేం జేసుకుంటాం?! అన్నట్టుగా స్కూల్లో జేర్పించారు విశాలను కాని విశాల తన బుద్ధి కుశలతవల్ల ప్రతి క్లాసులోను ఫస్టుగా రావ టంతో స్కూలుఫైనలు వరకూ సాగింది విశాల చదువు.

ఆడపిల్లకు యుక్తవయస్సు రాగానే పెళ్ళి చేసి పంపెయ్యాలనుకునే రోజులవి ఇప్పటి లాగా పాతికేళ్ళు ముప్ఫయేళ్ల వరకూ ఆడ పిల్లలకు పెళ్ళికాకుండా ఉండడం సాంఘిక నేరంగా భావించబడే రోజులవి అందుకని స్కూలుఫైనలింకా చదువుతుండగనే విశాలకు పెళ్ళి సంబంధాలు చూడసాగారు వెంక ట్రామయ్యగారు పక్క పల్లెటూళ్లో ఉన్న సంబంధం నచ్చిందాయనకు కుర్రాడి పేరు సాంబమూర్తి కండలు తిరిగిన శరీరంలో బలిష్టంగా అందంగా ఉంటాడు వయస్సులో, అందంలో అమ్మాయికి ఈడుజోడు తండ్రి పోతే .. స్కూలు చదువుకు స్వస్తి చెప్పి . తండ్రి మిగిల్చిన ఇరవై ఎకరాలు స్వయంగా వ్యవసాయం చేస్తున్నాడు తమలాగే పాడీ పంటా పుష్కలంగా ఉన్న కుటుంబం తల్లి సరసమ్మ వ్యవహారదక్షురాలు ఆమె సహాలతో ఆయిల్లు ధనధాన్యాలతో తులతూగులొందని గ్రహించారు వెంకట్రామయ్యగారు విశాల తల్లి సరస్వతమ్మకూడా ఈ సంబంధమెంతో నచ్చింది కూతురు అత్తింట సుఖపడటమే ఆమె ధ్యేయం! తమ ఆస్తి వాళ్ళ ఆస్తి అనుభవిస్తూ కూతురు లక్ష్మీదేవిలా కళకళ లాడుతుందని భావించి వెంటనే ఒప్పేసుకుంది దాని కారణంగానే ఈనాటి పెళ్ళిచూపుల తతంగం జరగబోయేది

"ఏమో బాబూ! నాకు సిగ్గేస్తుందే" గునిసింది విశాల... తల్లిదగ్గర తల్లిదండ్రులు మాట్లాడుకుంటున్నపుడు కాబోయే గారి అందచందాలు గురించి పొంచి వింది విశాల ఆమె అంతరంగం సంతోషంతో చిలిపిగంతులు వేసింది ఆశలు . కోర్కెలు మనసులో మోసులెత్తాయి పైగా పెళ్లిచూపులనాటి అనుభూతి ఎలా వుంటుందో తెలుసుకోవాలనే తపన. పైకి మాత్రం కావాలనే అలా అంది తల్లిదగ్గర.

"పెళ్లి చూపులకే ఇలా సిగ్గేస్తోందే! అంటూ ముడుచుకుపోతే రేపు కాపురమెలా

చేస్తావే! మీ ఆయనతో? అంతా చోద్యం గాకపోతేను! వెళ్ళు వెళ్ళు! నే చెప్పిన పని చేసిరా! సాయంత్రం నిన్ను బాగా అలంకరించటానికి మీ స్నేహితురాళ్ళని రమ్మని చెప్పులారే!'' తిరిగి తన పనిలో మునిగిపోయింది సరస్వతమ్మ

''ఛీ! పోమ్మా!'' మనసు గాలిలో తేలిపోతుండగా అక్కడినుంచి పరిగెత్తింది విశాల.

* * *

విశాలను అతిలోక సుందరిలా అలంకరించారు సాయంత్రం స్నేహితురాండ్రు ఇంట్లో నాలుగురకాల పిండి, కారాలు చేయించింది సరస్వతమ్మ సరిగ్గా నాలుగవ్వగానే ఎడ్లబండిలో దిగారు కాబోయే వియ్యాలవారు ఎదురువెళ్లి నరసమ్మ సాంబమూర్తులను సాదరంగా సగౌరవంగా లోనికి తీసుకొచ్చారు వెంకట్రామయ్య సరస్వతమ్మలు ఇక పాలేళ్ల హడావుడి ఇంతా అంతా కాదు వియ్యాలవారికి కాళ్లు కడుక్కోటానికి నీళ్లందియ్యటం. తువ్వాళ్ళందివ్వటం నట్టింట్లో మంచాలు వాల్చి తెల్లటి దుప్పట్లు పరచటం కుర్చీలు అటూ యిటూ సర్ది వియ్యాలవారికి ఏలోటూ జరక్కుండా చూడటం వారి పనులు! పెళ్లి చూపులు

# కనువిప్పు

సక్రమంగా సలక్షణంగా జరిగిపోయాయి సాంబమూర్తిని విశాల క్రీగంట చూసి సిగ్గుతో సంతోషంతో తలమునకలయిపోయింది సాంబమూర్తి విశాల జగన్మోహన సౌందర్యాన్నిచూసి మేను మరచిపోయాడు. సరస్వతమ్మ వెంకట్రామయ్యలే ఎక్కువగా నరసమ్మతో అవీ యివీ మాట్లాడారు. నరసమ్మ మాత్రం.. బింకంగా ఉండి ''ఆఁ!'' ''ఊఁ!'' అంటూ వింటూ కూర్చుంది వియ్యపురాలికి ఆ మాత్రం బెట్టు సహజం! అని సరిపుచ్చుకున్నారు సరస్వతమ్మా వెంకట్రామయ్యలు. పిల్లవాని అంగీకారం క్షణాలలో లభించడంతో కట్నాలు లాంఛనాలు గూడా నిర్ణయింపబడ్డాయి ''ఈ కట్నాలు లాంఛనాలు మొక్కుబడికేగానీ వదినా రేపు ఈ ఆస్తంతా దానికేగా! అహ! అల్లుడికేగా!'' అని సరస్వతమ్మ అనగానే నరసమ్మముఖం వికసించింది. మరోవారం తిరిగేసరికల్లా.

ఆకాశమంత పందిరి భూదేవంత ముగ్గులన్నట్లుగా పరమవైభవంగా జరిగిపోయింది విశాల వివాహం. అపోశన కార్యక్రమం కూడా అత్యంత వైభవంగా జరిపించారు విశాల తల్లిదండ్రులు అత్తవారింటికి పంపిస్తూ విశాలకెలా మసలుకోవాలో చెప్పి నరసమ్మతో ''మా అమ్మాయిని మీ చేతుల్లో పెడుతున్నాం! ఎలా చూసుకోంటారో ఏమో అంతా మీ దయ'' అంటూ ప్రాధేయపడ్డారు నరసమ్మ ఏం ఫరవాలేదన్నట్లుగా భావయుక్తంగా నవ్వింది. తృప్తిగా నిట్టూర్చారు. విశాల తల్లిదండ్రులు విశాల మనసు మనసులోలేదు కొత్త జీవితం.. కొత్త అనుభవాలు. గిలిగింతలు. పులకింతలు అబ్బ! ఎంత మధురం వివాహజీవితం ఆయనెంత మంచివారు! ఎంత కొంటెవారో గూడాను! అత్తగారుగూడా ఎంత మంచివారు! అంతవరకూ నోరు మెదిపి ఒక్క మాటన్నా అన్నారుగాదు! అత్తింట అడుగుపెట్టిన విశాల తన జీవితం స్వర్గతుల్యమే అనుకుని మురిసిపోయింది మధురోహలతో పరవశించిపోయింది. ''భగవాన్! నాకింకేమీ వద్దు! ఈ జీవితం చాలు!'' అనుకుని తృప్తిపడిపోయింది.

(ఇంకా వుంది)

# వారఫలం

మహేష్

7-5-1976 శుక్రవారం మొదలు
13-5 1976 గురువారం వరకు

మేషం — వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి మిత్రుల సహాయం లభిస్తుంది లనవసరమైన సందేహాలు కలుగుతాయి ఇలు నిమిత్తం ప్రముఖులు కాగలరు ప్రయోజనాలు పరిచయాలు ఏర్పడతాయి ఉద్యోగలో గౌరవం లభిస్తుంది స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

వృషభం — ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు ప్రయాణాలు వాయిదా పడతాయి సాహసిక వ్యవహారాలు లభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. స్త్రీలకు - ఆరోగ్యం బాగుంటుంది పుణ్యకార్యాలు చేస్తారు

మిదునం — రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి వారం ఆఖరులో విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్త్రీలకు- బంధుమిత్రులను కల్సుకొంటారు సంతోషకరమైన వార్తలను వింటారు

కర్కాటకం — మీ ఆలోచనలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది స్త్రీలకు - ఆరోగ్యం బాగుంటుంది శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది

సింహం :— ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది మీ ప్రయత్నాలు ఫలిస్తాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాహసిక వ్యవహారాలు లాభించ



# ప్రశ్నావళి

**కె. రామలక్ష్మి**

**పి. జి. కె. పి. — వంశధార.**

పిల్లలు పుట్టీపుట్టగానే ఏడుస్తారెందుకు?

ఆ ఏడుపే వినబడక పోతే ఆ తల్లి బాధ మీరు ఊహించ లేరు

**వి. ఎస్. ఎన్. — ఉయ్యూరు.**

మన సంస్కృతిని సంప్రదాయాన్ని మంట కలుపుతున్న నవ్య యీ దేశంలో పుట్టడం మా దవుర్భాగ్యం.

నేనూ అదే అనుకుంటున్నాను సంస్కృతినీ సంప్రదాయాన్ని ఏకపక్షంగా చేసి నిర్వచించే యీ దవుర్భాగ్యపు దేశంలో నేను కోరిపుట్టలేదు కాని ఎక్కడైనా ఆడదాని పరిస్థితి యిలాగే వుందని యిప్పుడిప్పుడే తెలియ వస్తోంది అందుచేత ఎక్కడ పుట్టినా ఒకటే అనుకుంటున్నాను అత్యాధునికం అనుకుంటున్న దేశాల నుంచి అత్యధమం అనిపించే దేశాల దాకా మహిళా మహోదయం కోసం పోరాడడం ప్రారంభించడం కొన్ని సత్యాలని చెప్పీచెప్పక చెప్తోంది కదా?

**ఎమ్. వి. ఆర్. ఆర్. — హైదరాబాదు.**

జీతాలు పెంచినా గడవడం లేదు అప్పు తప్పడంలేదు ఎలా ?

ఎలాగో చెప్పలేనుగాని, ఉన్నదానితో బ్రతక నేర్వని వాడు ఎప్పుడూ బానిసబ్రతుక్కే అంకితం అవుతాడు.

**పి. ఆర్ కె — పాకాల.**

జీవితంలో చేయాలనుకున్నవి చేయలేకపోతే అసంతృప్తి మిగులుతుంది, ఆ అసంతృప్తినిపోగొట్టి శాంతిని కూర్చుకోవాలంటే మనం ఏం చెయ్యాలి?

చేయదలచినవి చేయవలసినవి చేస్తూనే వుండాలి 'రేపటి'కి నెట్టకుండా ఇది చెప్పడం సులభమేగాని చెయ్యడం కష్టం ఎందుకంటారా? చెయ్యాలన్న ఉత్సాహం ఎంత వుందుకు తోస్తున్నా మానవసహజం అయిన బద్ధకం రేపుచూద్దాం లెద్దూ అనిపిస్తుంది

**ఎ. పి జె. — యలమంచిలి**

కాలేజీ అమ్మాయిలు కూడా అబ్బాయిలని ఏడిపిస్తున్నారంటాను ?

అది సరదాకి సరదాగా ఏడిపించటం వేరు చౌకబారుగా ఏడిపించటం వేరు

**ఎమ్. ఆర్ కె — బాపట్ల.**

ఒకరు మనలను హేళన చేస్తే ఏం చెయ్యాలి?

మనమూ హేళనచేస్తే యింక వాళ్ళకీ మనకు తేడా ఏమిటి? ఇగ్నోర్ దెమ్.

**జి ఎస్ ఆర్. — గొల్లప్రోలు.**

పతియే దైవము
పాకమే శాస్త్రము
వంటిల్లే కోవెల
వార్చటమే ప్రార్థన
వీటికొసమే గదా
స్త్రీ జన్మ ఇలలోన
ఔన ? కాద? వో
దాశరథిశ్రీ ?

ఆర్యా శ్రీనివాసా, చిత్తగించండి,
సతియే బానిస
సత్రాయింపె కాపురం
క్లబ్బే కోవెల
పేకాటే కద ప్రార్థన ?
వీటి కోసమే కద జన్మ
పురుషుల కిలలో ?
అవునంటారా? కాదన కలరా?
అవివేక చూడామణి ?

**కె ఆర్ — కలకత్తా.**

అం జా మ సం లో ఆడరాజకీయవేత్తలు సమానత్వానికై గాంధిటోపీలు పెట్టుకుంటే చాలా బాగుంటుందని నా మనవి

చిత్తం వివేకవంతులైన ఆడరాజకీయవేత్త గాంధిటోపీ పెట్టడంలోవున్న విలువ గ్రహించినవారై పెట్టుకోడానికి నిరాకరిస్తారని అనుకుంటాను

**జె హెచ్ బి — మిట్టపాలెం**

మంచికిపోతే చెడు ఎదురవుతుంది కారణం?

మంచికాలు కదిపేలోపల, నిలువ కాలులేని అబద్ధం ప్రపంచం చుట్టి రాకలదు అంచేత

**డి. యు కె — అయిజ**

ఈ కాలంలో చాలా మంది చెడుకే ప్రాధాన్యం ఇస్తారెందుచేత ?

ముందుకు పోవడం సులభం అన్న భ్రమచేత

**వి. వి ఆర్. — నూజివీడు**

మీ ప్రశ్నావళిమీద మావూరివాళ్ల ఉత్తరాలు చూశారా ?

చూశాను ఈ జంతువు చాలా క్రూరమైనది కొట్టబోతే చంపవస్తుంది అంటే ఎలా ?! అలాగె వుంది ఆ గోడు !

**జి ఆర్ కె — గుంటూరు**

మీ రిచ్చే జవాబులకు త్రాసులో మొగ్గు ఎప్పుడూ స్త్రీలవైపే వుంటుంది ఎందుచేత?

త్రాసు నాచేత కదా వుంది అంచేత మావైపు మొగ్గడంలో ఆశ్చర్యం లేదు !

---

కలవు స్త్రీలకు - కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలోచనలు చేస్తారు

కన్య — లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది ప్రయోజనకర పరిచయాలు ఏర్పడతాయి మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది స్త్రీలకు - ఆరోగ్యం బాగుండదు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

తుల - రావలసిన డబ్బు అందుతుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి స్త్రీలకు - కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతిలభిస్తుంది

వృశ్చికం — మీ కంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసివస్తుంది. సజ్జన

## వా ర ఫ ల ం

సాంగత్యం లభిస్తుంది వృత్తిలో ఆదాయం బాగుంటుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వారం ఆఖరులో ప్రయోజనంలేని శ్రమ కలుగుతుంది స్త్రీలకు - ఆరోగ్యం బాగుంటుంది అధిక వ్యయం జరుగుతుంది

ధనుస్సు — వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు మిత్రులకు సహాయం చేస్తారు స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి ప్రయోజనకర సంభాషణలను జరుపగలరు మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి స్త్రీలకు - విలాస వస్తువులు పొందుతారు సాటి వారిలో గౌరవం లభిస్తుంది

మకరం — సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి రావలసిన డబ్బు అందుతుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు - కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది పుణ్యకార్యాలు చేస్తారు

కుంభం — వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు వారం ఆఖరులో అనుకూలమైన మార్పులు వస్తాయి స్త్రీలకు - ఆరోగ్యం బాగుండదు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

మీనం — మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది రావలసిన డబ్బు అందగలదు మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును స్త్రీలకు - కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

పురుగులు మీరు
అనుకొన్న దానికంటే
ఎంతో త్వరగా పెరుగుతాయి

# ఫినిట్ ను
# మీ ఇంట్లో
# నియమంగా చిలికి
## మీ ఇంట్లో పురుగులను
## సురక్షితంగా,
## నిశ్చయంగా హతమార్చండి

ఫినిట్ క్రిమిసంహార ప్రణాళిక
ఫినిట్ ఉపయోగించే విధానం

ఎగిరే పురుగులు

ఈగలు [illegible] దోమలు [illegible] మిగిలిన కిటికీలు [illegible] తలుపులు మూసివేసి ముందు కిటికీలు [illegible] గదంతా పొగలా [illegible] చిలకండి 15 నిమిషాల తరువాత తలుపులు తెరవండి

ప్రాకే పురుగులు

బొద్దింకలు [illegible] పురుగులు, [illegible] పురుగులు [illegible] నల్లులు, [illegible] పురుగుల మీద విషయంలో [illegible] వాటి మీద [illegible] నేరుగా చిలకండి [illegible] బాగా [illegible] దగ్గర కూడా బాగా [illegible] చిలకండి. చిలకండి [illegible] గుర్తుంచుకోవలసినవి ఫినిట్ డబ్బా మీద ఇంతకంటె [illegible] ఉంటాయి వాటిని తప్పకుండా చదవండి [illegible] ఈ విషయం కూడా గుర్తుంచుకోండి [illegible] వేధించడమే కాదు [illegible] వ్యాపింపచేసాయి. అందుచేత ఇంట్లో [illegible] పురుగులను నాశనం చేయండి. వీటిమీద చిలకండి వాటిని చంపే ఫినిట్.




ఫినిట్ ఒక వైజ్ఞానిక ఫార్ములాతో తయారు చేసిన బహుళ విధోపయోగ క్రిమినాశిని ఇది ఎంతో శక్తివంతం కావడం మూలంగా ఇది తగలగానే ఈగలు దోమలు బొద్దింకలు, నల్లులు మొదలైన పురుగులు వెంటనే చచ్చిపోతాయి

అంచేత, నియమంగా ఫినిట్ చిలికి మీ ఇంటిని పరిరక్షించుకొనండి

దోమలు, ఈగలు, బొద్దింకలు, నల్లులపై

**ఫినిట్ చిలకండి**
**వాటిని నాశనం చేయండి!**

సురక్షితంగా నిశ్చయంగా
హతమార్చండి




CMHPF-3-244-Tel

హిందుస్తాన్ పెట్రోలియం కార్పొరేషన్ లి

కార్టూన్‌లు పంపేవారు స్వంత చిరునామా గల స్టాంపులతికించిన కవరుకూడా పంపడం మంచిది. సం.



# ఫాలాక్షుని డైరీ

## గత జన్మల జ్ఞాపకాలు

బెంగుళూరులో సత్‌బ్రాహ్మణులకు పుట్టిన ఓ పాప అయిదోఏడు రాగానే చాలాదారుణమైన, అసభ్యకరమైన, తక్కువకులాలవాళ్లు కూడా మాట్లాడుకోడానికి జంకే భాష మాట్లాడుతోందట. అదేమంటే తాను పూర్వజన్మలో తక్కువ కులం దానినని, అంతేగాక మలమూత్రాలను మోసినదానిననీ కూడా అంటోందట. జాతీయ మానసిక ఆరోగ్యసంస్థ మనస్తత్వ చికిత్స విభాగానికి చెందిన ప్రొఫెసర్ హెచ్చెస్ మూర్తిగారు యీ అమ్మాయిని పరీక్షించినా, పూర్వజన్మవాసనతో చెప్తున్నదని, అంగీకరించడానికి సుముఖంగా ఉన్నట్టు కనబడలేదట. ఈ బృందంవారు దేశం మొత్తం మీద యిప్పటికి ఓ పదహారు పునర్జన్మ కేసులు చూశారట. అన్నిటిలోనూ దాదాపు ఐదేళ్లపైన, తొమ్మిదేళ్ల లోపు పిల్లలేనట, ఒక్క కేసు మాత్రం 35 ఏండ్ల మహారాష్ట్రానికి చెందిన ఒకామెదట. ఆమె తనకు పూర్వజన్మ స్మృతి వచ్చిందని చెప్పడమేగాక, ప్రాచీన 19వ శతాబ్దంనాటి బెంగాలీ భాషలో మాట్లాడుతోందట. ఈఅన్ని కేసులకు చెందిన వ్యక్తులూ నిక్కచ్చిగా తమ పూర్వజన్మకు సంబంధించిన, ఆధారాలను నివాసాలను, వ్యక్తులను, సందర్భాలనూ కూడా వివరించారట.

## గునపంతో దొంగతనం

అమలాపురానికి చెందిన మొసలిపల్లి అనే గ్రామంలో పంతులుగారి రామభద్రరాజు అనే ఆయన యింట్లో నాలుగో తేదీరాత్రి దొంగలు పడి, ఆయన తలమీద గునపంతో ఓ దెబ్బవేసి, అదే గునపంతో యినప్పెట్టె పగలగొట్టి 30 కాసుల వడ్డాణము, 15 కాసుల ఓ చిన్న ఒడ్డాణము, 10 కాసుల దండ ఒంకి (జబ్బకు ఆడవారు పెట్టుకునే ఆభరణం) నాలుగు వెండి పళ్లాలూ వగైరా ఓ పాతిక వేల విలువచేసే నగ నట్రా పట్టుకు పారిపోయారట. రామభద్రరాజుగారికి భార్యపోయి చాలా కాలమయ్యిందట. పిల్లలను ఎక్కడి వారినక్కడికి పంపి గత పదిహేనేళ్లుగా ఆ యింట్లో వంటరిగా వుంటున్నారట.

## రోడ్లూడ్చే స్త్రీకి నిధులా!

పూనాలో రోడ్లు వూడిచేఒకామె హెచ్చు వడ్డీతో అప్పులిస్తోందని విన్న వార్తతో పోలీసులు తదితర సంబంధ వ్యక్తులు చెప్పా చేయక, ఆమె యింటి మీదపడి సోదాచేసి, కొయ్యబారి పోయారట. కారణం ఆమె యింటిలో వారికి లక్ష రూపాయలు నగదు, 38 తులాల బంగారం, బోలెడు పాత్ర, సామాన్లు ట్రాన్సిస్టర్లు, ఓ స్కూటరు దొరికాయట. వస్తువుల ఖరీదు లక్షని లెక్క తేలిందట

## అమెరికాకి పడని తేదీ వారాలు

అమెరికాకు శుక్రవారమన్నా, 13వ తేదీ అన్నా సరిపడదట. ఈ రెండు అశుభకరమైనవని ఆ ప్రజల నమ్మకమట. ఇహ ఈ రెండూ ఒకే రోజునవస్తే ........ విషయం చెప్పనక్కరలేదు కానీ అమెరికాలోని ప్రెసిడెంటు భవనం (వైట్ హౌస్) కట్టినది ఓ నాటి శుక్రవారం, ఆరోజు 13వ తేదీఅట.

## నోబుల్ బహుమతి పతకం వేలం!

నోబుల్ బహుమతికి యిచ్చే బంగారుపతకం బంగారువెల రెండువేలడాలర్లట. ఇటీవల ఓ కుచేలుడు తన నోబుల్‌బంగారు పతకాన్ని వేలం వేసుకుంటే ఓ కుబేరుడు పదిహేనువేల డాలర్లకు కొనుక్కున్నాడట.

## టూత్‌బ్రష్ పుట్టుపూర్వోత్తరాలు

ఈ నాడు మనం ఉపయోగిస్తున్నాము. అసలీ టూత్‌బ్రష్ అసలు 1498 లో చైనా దేశస్థులు కనిపెట్టారట. (టూత్‌బ్రష్ అనేది) ఆ తరువాత 1700 సంవత్సరంలో ఐరోపాదేశం వాళ్లు దీన్ని వాడనారంభించారట.

## మోసాలలో జపాన్ అగ్రస్థానం — స్త్రీల అగ్రతాంబూలం

జపానులో "మోసంచేసిన నేరాలు" ప్రపంచంలో అన్ని దేశాలకన్నా ఎక్కువనట. అనగాఅక్కడ చీటికిమాటికి ఎవరోఒకరు ఎవరో ఒకర్ని చీట్ చేస్తూనే వుంటారట. ఈ మోసం చేసే వాళ్ళలో స్త్రీలే ఎక్కువట. 56 నేరాలలకి 41 నేరాలు స్త్రీలుచేసినవేనట ఫార్వర్డ్‌మార్చ్ఫ్టీమన్ !

## లీప్ సంవత్సరంలో పుట్టిన తల్లీ కూతుళ్ళు

అమెరికాలో ఒకావిడ 1962 వ సంవత్సరం ఫిబ్రవరి 29 వ తేదీన (లీపు సంవత్సరం) పుట్టిందట. ఆమెకు వివాహం వగైరాలయి యీ ఏడు ఫిబ్రవరి 29న ఓ ఆడపిల్ల పుట్టిందట. లీపు సంవత్సరంలో పుట్టిన ఆమెకు లీపు సంవత్సరంలో పిల్ల పుట్టిందావటాని పత్రికలన్నీ రాసేశాయిట— సోడూవుయ్.

## ముప్పయిమూడు రాజ్యాంగాలు మారిన ఇటలీ

రెండో ప్రపంచయుద్ధానంతరంనుంచి నేటివరకు ఇటలీదేశంలో ముప్పయిమూడు రాజ్యాంగాలు(పార్టీలనుకోవచ్చు) పదవిలోకి వచ్చాయిట. అనగా ఏ పార్టీకూడా గోల్డెన్‌జూబిలీ చేయించుకోలేదనుకోవచ్చు!

## విమానానికి ప్రవేశం నిషిద్ధం?

న్యూయార్క్ కెనెడీ విమానాశ్రయంలోకి కొత్తగా ప్రవేశపెట్టబడ్డ కాన్కార్డ్ విమానం రాకూడదని ప్రవేశహక్కు దానికిచ్చేది లేదని "అక్కడి శాసన సభ తీర్మానించిందట. ఏల!! డోంటో ●

# ర్యాలిఫాన్ డీలక్స్. అన్నిటికన్న మేలైనది కావాలనుకుని, దానికి తగిన ధర ఇచ్చే వాళ్లకోసం ప్రత్యేకంగా డిజైను చేయబడినది.

ర్యాలిఫ్యాన్ డీలక్స్‌లోని ప్రతి భాగమూ సమర్థవంతంగా డిజైను చేయబడి, ఖచ్చితంగా తయారుచేయబడి, పూర్తిగా పరీక్ష చేయబడినది అది ఎప్పుడూ ఉన్నతమైన తీరులో పని చేసేందుకోసం కొత్తగా ఉన్నప్పుడే కాదు—వేలకి వేల గంటల కొద్ది పనిచేసిన తర్వాత కూడాను

- అపూర్వమైన 'బ్లేడ్ కాంటూర్' వలన ఎక్కువ గట్టిగా ఉండటమే కాకుండా, సమమైన తీరులో చల్లగా గాలి వీస్తుంది
- ఎంతో వీలుగా బాలన్సు చేయబడిన బ్లేడ్లవలన, మోటారు పైన సరిసమానమైన బరువు పడుతుంది దీనివలన మోటారు ఎక్కువ కాలం నడుస్తుంది
- ఏ కోణంలోనైనా సాఫీగా, నిశ్శబ్దంగా తిరిగేందుకు గాను ఖచ్చితంగా అమర్చబడ్డ ప్రత్యేకమైన స్టాండు
- తేలి నదీ అయినా స్థిరమైన 'వేన్' స్పీడును నిర్దేశించేందుకు గాను, తేలికగా, ముట్టుకుంటే చాలు పనిచేసే పియానో కీ స్విచ్‌లు
- ఎంచుకోడానికి 5 రంగుల్లో ప్రత్యేకమైన స్టో ఎనామెలింగ్ మరియు ఇన్‌ఫ్రా-రెడ్ బేకింగ్ పద్ధతితో ఉపరితలాలను ఫినిష్ చేయడంవలన, ఏళ్ళతరబడి కొత్తగా కనిపించేలా చేస్తుంది

అందుకే, మీరు ర్యాలిఫాన్ డీలక్స్‌కు మరికాస్త ఎక్కువ డబ్బు ఇస్తున్నారంటే, నిజానికి మీరు ఉన్నత శ్రేణిలోని నాణ్యాలా, ఉత్తమమైన పనివాడితనమూ, శ్రేష్ఠంగా పనిచేసే లక్షణం కోసమూ ఇస్తున్నారన్నమాట



## ర్యాలిఫాన్

కాలానికి నిలుస్తుంది—ఎంతో అందంగా

U-RTF-17 TEL

# అదీ-ఇదీ-అన్నీ

### ఆస్తి — స్మృతులు

హైదరాబాద్ లరసం పదవ ప్రచురణ

ఆస్తి గురించి మన ధర్మశాస్త్రకారుల అభిప్రాయాలని ఆధునిక దృక్పథంలో పరిశీలించి శ్రీ ప్రా౹ల సోదాహరణంగా తమ అభిప్రాయాలని ఈ పుస్తకంలో పొందుపరిచారు. 40 పేజీలు వెల ఒక రూపాయి ప్రతులకు హైదరాబాద్ అభ్యుదయ రచయితల సంఘం, సుల్తాన్‌బజార్, హైదరాబాద్ 29, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 2, విశాలాంధ్ర బుక్ హవుస్, సుల్తాన్‌బజార్, హైదరాబాద్.

### గుడ్డివాడు

రచన దనికొండ హనుమంతరావు నవలా రచనలో చెయ్యి తిరిగిన దనికొండవారి బహుళ ప్రచారం పొందిన యీ నవలను ఎమెస్కోవారు పునర్ముద్రించారు 115 పుటల యీ నవల వెల రు 3-50 ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ రాష్ట్రపతిరోడ్డు సికింద్రాబాద్‌కి వ్రాయవచ్చు

### శిలలో సెలయేరు

రచయితలు శ్రీయుతులు విహారి, శాలివాహనల మూడవ కథాసంపుటి ఇందులో మొత్తం 8 కథలు ఉన్నాయి ఈ కథలన్నీ ప్రముఖ వార మాస పత్రికల్లో ప్రచురితమై పాఠకుల ప్రశంస అందుకున్నవే 108 పేజీలు, వెల 4 రూపాయలు ప్రచురణ స్పందన సాహితి సమాఖ్య, మచిలీపట్టణం

### వినరా సుమతీ

సుమతీ శతకానికి సుజనరంజనీ వ్యాఖ్య వ్యాఖ్యాత డాక్టర్ వి వి యల్ నరసింహారావు 66 పేజీలు, వెల 2 రూపాయలు ఈ రెండు పుస్తకాలూ స్పందన సాహితీ సమాఖ్య (రిజిస్టర్) 23, 182ఇ, న్యూ మునిసిపల్ కాలనీ, మచిలీపట్టణం అన్న చిరునామాకి రాసి పొందవచ్చును ★

### గమనిక

"మినీ యింటర్వ్యూలు" అనేవి టపాలో వస్తే వాటిని స్వీకరించి వేయడం సాధ్యం కాదని మా యువ పాఠకులకు మనవి. సం.








# కాళేశ్వరము

— వి. నాగేశ్వరశర్మ

"త్రిలింగ" దేశ వ్యుత్పత్తిని సూచించేవి శ్రీశైల, దాక్షారామ, కాళేశ్వర లింగాలు వీటిలోని కాళేశ్వరం కరీంనగర్ జిల్లాలోని కుందెన తాలూకాలోని గోదావరి దక్షిణతీరం మీద ఉంది. పూర్వం మహా వైభవంగా వెలిసిన ఈ క్షేత్రం గురించి తగిన ప్రయాణ సౌకర్యాలు లేకపోవటం మొదలయిన కారణాలవలన ఇప్పుడు ఎందరికో తెలియకుండా ఉంది

ఇక్కడికి చేరుకోవాలంటే మహదేవపురం (పంచాయతీ సమితి కేంద్రం) నుంచి ఎనిమిది మైళ్ళు నిట్టడవి మార్గంలో ప్రయాణం చెయ్యాలి సమితి రోడ్డు ఉంది, బస్సు సౌకర్యాలు ఇంకా ఏర్పడలేదు కారు, బండి—వీటిలో వెళ్లవచ్చు కాళేశ్వరం నదికి అవతల వయిపు మధ్యప్రదేశ్ రాష్ట్రం. ఉత్తరాన అదిలాబాదు వయిన మహారాష్ట్ర. అందు చేత ఇక్కడికి ఎందరో ఈ రెండు రాష్ట్రాల నుంచీ వస్తూ ఉంటారు.

ఈ క్షేత్రం ప్రణీత, గౌతమీ నదుల సంగమం వద్ద ఉంది. రెండు నదులకి నాలుగు మార్గాలు, సంగమానికి మరి రెండు కలిసి మొత్తం షట్‌కోణాన్ని కలిగించటంచేత "సంగమతీర్థ, షట్కోణమధ్యే" అని సంకల్పం చేసుకుంటూ జనం స్నానాలు చేస్తూ ఉంటారు. ప్రత్యక్షంగా రెండు రంగులుకల రెండు నదులు కలిసేచోటు ఇది, కాని, ఇది పంచనదుల కలయిక అంటారు — ప్రణీత, వైన్య, వరద, సరస్వతి, గౌతమీ నదులు కలుస్తాయి అంటారు. స్కాంద పురాణంలో, "ప్రమాగాత్ కోటి శోధికం" అని చెప్పబడి ఉంది ఈ క్షేత్ర ప్రస్తావన బ్రహ్మాండం పురాణంలో, విద్యానాథకవి రాసిన "ప్రతాపరుద్ర యశోభూషణం"లో ఉంది.

సుకంద్రుడనే ఆర్యాంధ్రుడి కుమారుడు ఆంధ్రవిష్ణువు, ఇతను నిశుంధుడనే రాక్షసుడిని చంపి, వాడి నివాసాన్ని ఆక్రమించి, శ్రీశైల-భీమేశ్వర-కాళేశ్వరాలని మహేంద్ర పర్వతంతో కలిసేట్లు ప్రాకారాలని నిర్మించి

"త్రిద్వారములు"గా ఏర్పరచి, పాలించాడని బ్రహ్మాండ పురాణంలో వుంది, దీనినిబట్టి కాళేశ్వర క్రీ. శ ఆరవ శతాబ్దంనాటి ఆంధ్ర విష్ణువు కాలంనాటి నుంచి సుప్రసిద్ధమయి నట్లు తెలుసుకోనవచ్చు.

విద్యానాథుడి గ్రంథంలో మూడు లింగాల మధ్య వుండే దేశం "త్రిలింగదేశం" అని పేర్కొనబడింది. పద్నాలుగవ శతాబ్దంనాటి విన్నకోట పెద్దిరాజు కూడా తన "కావ్యాలంకార చూడామణి"లో

"ధరణి పర్వత కాళే
శ్వర దాక్షారామ సంజ్ఞవరయు త్రిలింగా

కారమగుట నాంధ్రదేశం
బిరుదారా తిలింగదేశమున జనుశ్రుతులన్.

అని చెప్పారు కాళేశ్వరంలో ప్రధానాలయం ముక్తేశ్వరాలయం ఇందులోని ఒక శాసనం రెండవ హరిహరరాయల కుమారుడయిన దేవ రాయలు వేసిన తులా పురుషదానాన్ని గురించి చెప్పు ంది.

కాళేశ్వరం మనుడు (కాలుడు) ఈశ్వరుని కృపచేత నిర్మించిన పట్నం అని చెప్పబడి వుంది జయవిజయులు కాశి-కాళేశ్వరాలని గురించి తగాదా పడగా సూర్యుడు కాళేశ్వరమే గొప్పదని చెప్పాడుట. చాలా మంచివి ద్వై లింగములు కనక, గర్భాలయంలో సూర్య భగవానుడు, జయవిజయుల విగ్రహాలు ఉన్నాయి.

ఈ ఆలయంలో సాధారణంగా ప్రధాన మూర్తికి ఎదురుగా కనిపించే నంది కనిపించదు రాతి ధ్వజస్తంభం ఒకటి వుంది, దీనికి ఏర్పరచిన మండపంలో నంది విగ్రహం ఒకటి ఉంది

కాళేశ్వరంలో ఒకే పానవట్టంమీద రెండు లింగాలను చూడవచ్చు ఇదొక విశేషం ఒక పీఠంమీద కాళేశ్వర, ముక్తేశ్వర లింగాలు కలిసి ఉండటం చూడటానికి ముచ్చటగా ఉంటుంది

ఇక్కడ సరస్వతి ఆలయం ఒకటి ఉంది. ఆలయంలోని సరస్వతీదేవి విగ్రహం అయిదు అడుగుల ఎత్తు వుంటుంది. దేవి హస్తాలన్నిటిలోనూ ఆయుధాలు ఉంటాయి. మంథెన, బాసర్, కాళేశ్వరాలలో మూడు సరస్వతీ దేవాలయాలు ఉండటం గమనించ తగిన విషయం ఈ ప్రాంతంలో సరస్వతీదేవి ఆరాధన ఒకప్పుడు ప్రధానంగా ఉండి ఉండవచ్చు

ముక్తేశ్వరాలయానికి వెనకపక్కనే అవురంగజేబు నిర్మించిన మసీదు ఒకటి ఉంది. శ్రీరాముడు, పరశురాముడు, జాబాలి-వీళ్ల పేరులు ఈ క్షేత్రంతో సంబంధం కలిగి ఉన్నాయి.

శివపురాణంలో ద్వాదశజ్యోతిర్లింగాలు వివరించబడి ఉన్నాయి. వీటిలో కాళేశ్వరం పేర్కొనబడలేదు

ఈ కాళేశ్వరాన్ని గురించి తగిన ప్రచారం లేదు. అది జరిగితే దానిని గురించి తెలుస్తుంది మన ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు, రవాణాశాఖ మంత్రి శ్రీ చొక్కారావుల ఆధ్వర్యంలో మొదలయిన పునరుద్ధరణ కార్యక్రమాలని విజయవంతం చెయ్యటం మనందరి కర్తవ్యమూను,



గ్రంథస్వీకారం : గమనిక

స్థలాభావంచేత గ్రంథ స్వీకారం మాత్రమే ఆంధ్ర సచిత్ర వారపత్రికలో అప్పుడప్పుడు వేయగలుగుతున్నాము పుస్తకాల శీర్షిక క్రింద సుదీర్ఘమైన సమీక్షలు సాధ్యం కావు. గ్రంథస్వీకారం శీర్షికకి ఎంపేవారు రెండు ప్రతులు పంపవలసి వుంటుంది దీనికి సంబంధించి ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా సాధ్యంకానివని అని మనవి —సం

## యువతరం

తెనాలి కాలేజీలో బి. కాం. చదువుతున్న కె. ఎ. హెచ్. ఖాన్‌కి నాటకాలంటే ఇష్టం. అంతర్ కళాశాల నాటక నాటిక పోటీల్లో ఉత్తమ సహాయ నటుడు, హాస్య నటుడుగా బహుమతులు పొందాడు.



తెలుగు, హిందీ, ఇంగ్లీషు సినిమాలు చూస్తాడు. తెలుగులో కృష్ణ అభిమాన నటుడు. హిందీలో దిలీప్, ధర్మేంద్ర అమితాబ్‌లు. మహ్మద్ రఫీ పాటలంటే ప్రాణం అన్నాడు. ఇందిరాగాంధీ నాయకత్వంలో పరిపాలన బాపుంది అని అంటున్నాడితడు. క్రికెట్ ఆటగాడు విశ్వనాథ్ అంటే అభిమానంట. ఫిలిం యాక్టింగ్‌స్కూల్‌లో చేరి మంచి నటుడిగా శిక్షణ పొందాలన్నదే ఇతని ఆశయం.

## హైదరాబాద్ నోట్ బుక్

(12వ పేజీ తరువాయి)

ణించడంతో, తెలుగుజాతి కీర్తి విస్తరింపె మరోక నక్షత్రం రాలిపోయినట్టయింది. ఈయన వయసు 59 సంవత్సరాలు. ఈయన రసాయన శాస్త్రాచార్యుడుగా 1949లో పదవి స్వీకరించినప్పటి నుంచి పెక్కు ఉపసంఘాలలోను, సిండికేట్‌లోను సీనియర్ సభ్యులుగా ఉన్నారు. 9వ తేదీన కోటీలోని మహిళా కళాశాలలో వైస్ చాన్సలర్ డాక్టర్ జగన్మోహన్‌రెడ్డి అధ్యక్షతన న.ర కళాశాలల ఉపాధ్యాయులు సమావేశమై సుబ్బారావు పేర విశ్వవిద్యాలయంలో బంగారు పతకం బహుమతి స్థాపించాలని, ఆయన కుటుంబ సహాయార్థం నిధిని 'సేకరించాలని' నిర్ణయించడంబట్టే సుబ్బారావు సర్వజన ప్రియత్వం, నిజాయితీ స్పష్టమవుతాయి.

ఉపశ్రుతి :

"నాకు క్వశ్చన్‌పేపర్‌లో ఒక్క చాయ్స్ కొశ్చనూ లేదక్కా? వైమురేక అన్నీవదిలేశానక్కా" అన్నది 7వ తరగతి పరీక్ష వ్రాసిన విద్యార్థిని నిర్మల.

"అవును మరి! చిన్న తరగతులలో బాగా చదవాలి. కనుక చాయ్స్ ఎందుకు? మేమంటే పెద్ద పిల్లలం. బి. ఎ. వాళ్లం. మాకు చాయ్స్ ఉండాలి. పుస్తకమంతా ఎవరు చదువుతారు, వేరే పనిలేదా? అన్నది బి. ఎ. విద్యార్థిని రమ.

— తిరుమల రామచంద్ర



Printed and Published by S. NageswaraRao at
the Andhra Patrika press, MallikarjunaRao Street,

# ఎన్నో హెయిర్ డైలు, జుట్టును పైపైనే డై చేస్తాయి కనుక, త్వరగా వెలిసిపోతాయి... కానీ

# ట్రూ-టోన్

## మాత్రమే, ప్రతి వెంట్రుకలోకి చొచ్చుకొనిపోయి, జుట్టును శాశ్వతంగా డై చేయడమే కాక... జుట్టుకు సహజమైన ఆ రూపాన్ని యిస్తుంది.

ట్రూ-టోన్... దానిలోని ప్రత్యేకమైన సూత్రీకరణ వలన, వెంట్రుకలోని క్యూటికల్‌ను ఛేదించి కార్టెక్స్‌లోకంటా చొచ్చుకొని పోతుంది. ఫలితంగా, ఈ డైను జుట్టు త్వరగా గ్రహించుకుంటుంది... మరోమాటలో చెప్పాలంటే ఈ డై, జుట్టు యొక్క రూపాన్ని శాశ్వతంగా సహజంగా ఉండేలా తీర్చిదిద్దుతుంది.
ట్రూ-టోన్, జుట్టుకు సంబంధించిన రసాయన శాస్త్రం బాగా తెలిసిన హెలిన్ కర్టిస్ వారు సృష్టించినది.

క్యూటికల్
కార్టెక్స్
మెడుల్లా
వెంట్రుకలోని భాగాలు

ఇతర డైలు— పైపైనే డై చేస్తాయి. ఫలితంగా త్వరగా వెలిసిపోతాయి.

ట్రూ-టోన్ కార్టెక్స్‌ను ఛేదిస్తుంది. జుట్టులో అతి ముఖ్యమైన పొర.



లిక్విడ్

వీటిలో దేన్నయినా ఎన్నుకోండి:
ట్రూ-టోన్ లిక్విడ్ హెయిర్ డై మరియు
బొట్లుగా కారని ట్రూ-టోన్ జెల్.

ఈ రెండు మీ జుట్టును మృదువుగా, నిగనిగలాడేలా కావలసిన తీరులో లొంగేలా తీర్చిదిద్దగలిగే హెయిర్ కండిషనర్‌తో కూడినవి.



జెల్

మీ జుట్టును మొదటి సారిగా డై చేద్దామనుకుంటున్నారా?
ఉచితంగా లభ్యమయే ఒక చిన్న పుస్తకం,
"హెయిర్ డైయింగ్ ఎక్స్‌ప్లెయిన్డ్", కోసం
ఈ చిరునామాకు వ్రాయండి:
జె.కె. హెలిన్ కర్టిస్ లిమిటెడ్, జె.కె. బిల్డింగ్, బొంబాయి-400 038

నలుపు మరియు గోధుమ రంగులలో లభ్యమవుతుంది. మగవారి కోసం ప్రత్యేకమైన ప్యాక్.

మీకు కావలసిన వివరముల కోసం : ప్యారీ అండ్ కంపెనీ లిమిటెడ్, మద్రాసు, కోయంబత్తూరు, మధురై, తిరుచి.

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA